నిన్నుఁ బాసి చరింప నా కన్నులాన
యనుచు వచియించి వలపుల నలరఁ జేసె.

వ. అనంతరమున,

ఉ. అక్క అతీతెఁ జాలునని యాత్మఁ గడుంగడు నుల్లసిల్లి, "నీ
చెక్కు చెమర్పకుండ నిను శ్రీసతిఁ జేసెద, వెంకునాయనిన్
డక్కఁ గొనంగ నోపుదువు టక్కులెఱింగిన టెక్కులాడి వం"
చక్కడనుండి నెవ్వడి గృహంబున కేగి భుజించి తృప్తిగన్.

ఉ. "ఎక్కడఁ దెచ్చెనో యెఱుఁగ మింతధనం" బని యింటనుండు వా
రక్కజమంది లోనలరు నట్టుల బియ్యముఁ బప్పుకూరలున్
జక్కని బట్టలన్ గొనియె సంగి యతండు పరుండె; నంతలో
జక్కవ తేఁడు గ్రుంకె నెఱసంజను పత్నులుఁ బాటెగాఢ్రకున్

వ. తత్సమయంబున హేమసుందరుఁడు మేలుకొని,

గీ. కన్నులను విప్పి దిక్కులఁ గలయఁ జూచి
ప్రొద్దు గ్రుంకెనో యని లేచి ముకురమునను
ముఖముఁ దిలకించి తిలకంబుఁ బొందుపఱచి
వెంకునాయని వీక్షింప వేగఁ జనియె.

చం. చనిచని వెంకునాయని నిశాంతము మెల్లగఁ జేరి లోనికిం
జని తన రాకఁ దెల్పిన ప్రసంజను డెంచి హసించి నాయఁడి
ట్లనియెను - "రెడ్డిఁ జూచితివె? యాశ నిపంపున వచ్చియుందువా
వనితలయూచి, భూవరుని కంతయుఁ జెప్పితి హేమసుందరా.



ఉ. వైద్యమునందు మేటివని పల్వురుఁ జెప్ప వినంగ వింటి; నా
విద్య రహింపఁగాదె వన వీధులపై నధికారి మున్న; దు
ర్భేద్య వనాగ్రు తేలు బకుఁ బెద్దతనంబు నృపుండొసంగెఁ గా
ర్యోద్యమ భారమూని నరపోత్తము చిత్తముఁ గొమ్ము మేలగున్.

గీ. ఘోరకాంతారసీమాధికార మొందు
చేకురెం గద యనిసంతసింపవలయుఁ
బను లొనర్చిన గొలఁది రాబడియుఁ గలదు
వేతనము స్వల్ప మని యెంచి విడువరాదు.

గీ. వనములన్ బర్వతముల సేవకులఁ బెట్టి
సొంపు దైవాఱ నీవు పాలింపవలయు
భళిర రసికుండ విప్రుఁడు పాలకుండ
వైతివి ఫలించె నేఁడు నీ జాతకంబు.

చం. పతి నిను మెచ్చునట్లు పనిపాటుల కెంతయు సాతసించు న
ట్లితరు లొనర్చు తప్పుల గ్రహించి యెఱుంగని యట్టులుండుమా
యతివినయంబుతోనని నాఖిలుఁ డౌదలయూచె జిత్తమం
చతివినయంబు ధౌర్త్య మను నార్యుల వాక్యము నెఱుఁగకుండు నే

ఉ. వెండియు నాయఁ డిట్లను వివేకముఁ గల్గి మెలంగుమింగిత
జ్ఞుండని భూమిపాలుఁడు నినుం గొనియాడినఁ జాలు వాడురా
కుండ నొనర్చి కష్టముల కోర్చిన మేలగుఁ గాదె యట్టియ
ట్లుండెడు మాట కుత్తరమీఁ గలవంచు నెంచెదన్.

ఉ. పాటలగంధిగోపిక పాటవమొప్పఁగఁ దేన లూరఁగన్
బాటలఁ బాడు జాణయని పల్వురు గొప్పగఁ జెప్పుచుందు రా
మాట నిజంబె? పామరుల మాటలలో నిజముండదైన మీ
మాటము దక్క చెప్పనిజ మాయనృతంబొ యెఱుంగఁగోరెదన్.

ఉ. గానకళారసగ్రహణ కాంక్షకడుంగడు హెచ్చె; గాయకుల్
వీనులకింపు నింపరు చలింపక పాడిననేమి? శ్రీకళా
నూనవికస్వర స్వరరసోల్బణముండదు, నిశ్చయంబుగా
సానులఁ జెప్పి చెప్పవలెఁ జానల నెల్లరఁ బాడనేర్చినన్.

వ. అనిన విని చిక్కఁగదాయని సంతసించి,

చం. సరసులు గోపిపాట విని సన్నుతులీయఁగ నేను వింటి రాల్
గరఁగి స్రవింప, శుష్కతరుకాండము వెండియుఁ బల్లవింపసు
స్వరమునఁ గంచుగంటవలెఁ బాడఁగ నేర్చినకంబుకంఠి, యా
తరుణినిఁ జెప్పి చెప్పవలెఁ దక్కినసానుల గానమాధురిన్.

ఉ. స్వైరవిహారధీర రతిసంగతుల న్నతిఁ గొన్న ప్రౌఢ సం
సారిణిఁ బోలియుండు నెఱజాణ నిజంబుగ దానిపోలు శృం
గారవతిన్ మఱొక్కరితఁ గానము గానమటుండనిందు; మీ
కోరికఁ దీర్చు నామెయనుకూలగతిన్ బహుభావ లేటికిన్.

ఉ. అక్కట వెంకునాయఁడని సంతసయామెకుఁ జెప్ప కేమికిను
న్నక్కలు చెమ్మగిల్లుఁ దనుసీమ గగుర్పునఁ దల్లడిల్లు; జక్
ముక్కులు కంచుకత్రుటన ముక్ బొనరింపఁగ నుల్లసిల్లు మ
క్కువ పుట్టిదో యెఱుఁగు మన్మథుఁ డొక్కఁడు నిక్కువంబుగన్.



గీ. భోజనముఁ జేసి మీరల భోజవదనఁ
జూడఁదగియుండు రండని సుందరుండు
వెడలె; వేశ్యాప్రవేశవ వేశమునకు
గాన మనునది ప్రథమసోపాన మౌర.

గీ. హేమసుందరుఁ డాగోపికయింటి కేగి
రొప్పి విఱిగి నేతంబడ్డ యుస్సు లయ్యొ
నాతి యని పూనగుచ్చిన రీతి దెలిపె
జరిగినయుదంతమంతయు సంతసమున.

వ. గోపికయుం బరమాహ్లాదంబుఁ బొంది మీ కళకళ్యమగు కా
ర్యముండునే యని యనేకవిధంబులం గొనియాడుచుఁ గౌఁ
గిటం జేర్చి, సరససల్లాపంబుల నాపల్లవుని యుల్లం బుల్లసి
ల్లం జేయుచు మెల్లగ లోఁ గొనియె. వెండియు,

గీ. ముద్దుగుమ్మ తేనియలూరు సుద్దులాడి
ముద్దులనొసంగెఁ గడగొట్టు ముద్దు లేమొ?
పోకలనొసంగి పైఁ దెల నాకు లిచ్చె
నిపుడు విడుగగ యుల్లాకు లిచ్చె నేమొ ?

వ. తత్సమయమున,

సీ. తైలసంస్కృత కేశజాలంబు వ్యామోహ
పాశజాలనిబద్ధపక్షిఁ దెలుపఁ
దిలకచిత్రితఫాలఫలకంబు నిజగూఢ
గాఢానురాగ నిరూఢిఁ దెలుప

వక్షోవలంబిత । ప్రసవమాలికన్నిర్జి
రోధరతీనాథ । బాధఁ దెలుపఁ
దనులిప్తచందన । ఘనసారవాసనల్
తనమనోమలినవా । సనలఁ దెలుపఁ

గీ. గాలమేఘోపమితదేహ । నీలకాంతి
యతులకామాంధకార మా । హాత్మ్యముఁ దెలుపఁ
డెంద మానందముం బొంద । మందగతుల
నోడ కేతెంచె నాయఁ డప్రోడ జూడ.

మ. అహహా! యాత్మసతీపవిత్రముఖచంద్రాలోకజాత్యంధులై
కుహనారాగధనాంగనాముఖకుహూఘూకంబులై మోహవి
గ్రహులై దుర్విటభోగజాతసుఖరోగగ్రస్త వారాంగనా
గృహముం జేరుదు రిట్టి కాముకులు సంగీతాపదేశంబునన్.

వ. సడిఁ బట్టి నాయఁ డేతెంచెనని గ్రహించి హేమసుందరుం
డెదు రేగి,

గీ. అతని వీక్షించి, రండని । యాదరించి
యాసనముఁ జూపి యిది మీగృహంబ యనుచు
నిచ్చకము లాడి యాతిథ్య । మిచ్చి వెడలె?
వినమె "అభ్యాగతః స్వయం । విష్ణు" వనఁగ.

గీ. హేమసుందరుఁ డారీతి । నేమివలన
దాను వలచినపొలఁతుకఁ । దార్చెఁగాని
యాత్మలోఁ బరితాప మత్యధికమయ్యె
నింటి కేరీతి వచ్చెనో । యెఱుఁగఁ డతఁడు.



సీ. ఉల్లంబు రంజిల్ల । మల్లెపూవులఁ బోలు
నన్న మంతయుఁ గొత్త । సున్నమయ్యె
దాలిమిం గొనఁదగు । మేలిమితాలింపుఁ
గూరలన్నియు మిత్తి । కోలలయ్యెఁ
బరిపక్వవిధులను । సరిలేక యొప్పారు
పప్పు లన్నియుఁ బాత । చెప్పులయ్యె
నల్లారు ముద్దుగ । నిల్లాలు పలికెడు
పలుకు లన్నియు వాడి । ములుకులయ్యె

గీ. నాలు తేలయ్యె, నిల్లు ముల్లయ్యె నకట
యాలినొల్లనివానికి । నీలకూర
చప్పగా నుండు నంచు రాసరసుఁ డింట
నెట్లు భుజియించి బ్రదుకునో । యెవ్వఁ డెఱుఁగు.

గీ. మనము గోపి కొసంగి మైమఱచి యాతఁ
డేమి భుజించెనో మది । నెఱుఁగకుండెఁ
బండుకొన నెంచి మెల్లగఁ । బఱుపుఁ జేరెఁ
బఱుపుగా దది తనమేని । కుఱుపుగాని.

శా. ఔరా! చక్కనిచుక్క దక్కవని నే నాశించితింగాని, నా
దారిద్ర్యం బొకభూతమై పరువనకుం దార్పించె, నిర్భాగ్యుఁ డా
సారంగాక్షి రమింపఁగాఁగలఁడె? యా చక్కందనం బాహహారం
గా రామామణి కేతగుల్ బలుకు లేలా? యేల లేకుంటిఁగా!

శా. ఆమోవింగల కెంపు నానగు మొగం। బా కన్నులా చన్నులా
హా మేల్మేలని మెచ్చవచ్చుఁగదరా। యాచెక్కులారక్కలా
రా! మైఱీవి, బలారె, యెన్నఁదగురా। యాటక్కులా టెక్కులా
రామారత్నముఁ బోలు రామగలదా। రామాజగన్మండలిన్.

సీ. మతిమాలి గతిఁదూలి। రతికేళిఁ బాసితి
గోపికా దదిసుధా। వాపిగాని
సిరిలేక సరిలేని। గరితసర్పించితి
సాతిగా దది మారు। హేతిగాని
బ్రతిమాలు సతినేలు। ధృతిగోలుపోయితి
భామగా దది రతి। సీమగాని
వగలాడి దిగనాడి। జగమోడినట్లైతిఁ
గాంతగా దది జగ। జంతగాని

గీ. తలఁపు తులకింప, వలపులు। తొలకరింప
వాలుఁగంటిని ముద్దార। నేలుకొంటి
మేలుకొంటి నిప్పుడు గోలు। గోలు మంటి
మంటికిన్ మింటికిన్ మంట। లంటె నంటి.

గీ. పోకలకు రూకలంగొను। పోకలాడి
యిచ్చకములాడి యేల్కొను। మెచ్చులాడి
దానిసరిమైనజాణ జ। గానఁ గానఁ
దలఁప నాలంజె తియ్యని। తాటిముంజె.



సీ. మరులుగొల్పెడుకల్కి। మరునియారవముల్కి
మురిపెంబులకునండ। విరులదండ
పూదేనియలచాలు। పొంకంబులకుఁ బ్రోలు
అందంబులకు నిక్క। యతనుధక్క
రమణులపూసెజ్జ। రతులనేరుపునొజ్జ
వెరవులపోఁడిమి నా। వేఁపటావు
మణితంత్రులవీణ। గణుతికెక్కినజాణ
వలపులదీవి పూ। విలుతుకోవి

గీ. మంచియన్నులమిన్న లే। మావిగున్న
భళిర! పూవిన్నరతిచేతి। పసిఁడిగిన్నె
ముచ్చటింపంగఁదగుకొమ్మ। ముద్దుగుమ్మ
దాని సరిసానిఁగాన నెం। దేని గాని.

సీ. జిగిమీటి వగఁగూరి। జగడంబులనుగోరి
మురిపించుముద్దుల। మోవిదాని
అలజక్కవలవెక్క। లణఁగఁద్రొక్కఁగనిక్క
జక్కలించుగబ్బి। చనులదాని
ఘనమానులను దీను। లనుజేయు శృంగార
ఖనులఁబోలిన లేడి। కనులదాని
అలపద్మకరుణాసద్మ। మగుపద్మమును మీఱు
గోముగల్గిన నిండు। మోముదాని

గీ. సీటుగలరంభ సిలువున । నీరుగాఁగ
నొడలుపులకింపఁ జేయు నన్ । దొడలదాని
నాయనికిఁదార్చి యతను సం । తాప మోర్చి
మరులుకొంటి,సిగ్గొంటినై నేఁ । బొరలుచుంటి.

గీ. స్వార్థనాశంబు వైరాగ్య । మనఁగ నిట్టు
తనదు సౌఖ్యంబు పెరలకు । ధారవోసి
అతివ యగురాధయున్ నేను । నగ్గలముగ
నగ్గమైతిమి మరుబారి । కక్కటకట.

ఆ. విత్త మీయవచ్చు । విలువఁ జెప్పఁగరాని
ప్రాణ మీయవచ్చు । భయముదక్కి
తానువలచినట్టి । తరుణి నొక్కని కిచ్చి
ఇట్లు విరహతాప । మొనయఁదగునె.

చ. నడుమసియాడ నేత్రనలి । నంబులొకింత మకమోడ్పుఁ జెందదుం
దుడుకునఁ జన్నుఁదోయి కదుఁ । ద్రుళ్ళఁగమైఁ బులకల్జనింపనుం
దొడలునటింప నంగనక । నుంగొన నంగజసంగరంబునన్
గడపయివీటిసానిగతిఁ । గ్రాలుగదా మదియుల్లసిల్లగన్.

గీ. చెఱకువిలుకాని గరువంబు । చెల్లనీక
అద్దిరాయని ముద్దుల । యవ్వదీర్చి
దలచి వణకించి నన్నేలు । పొలఁతి జాసి
గాసిలితి జాలి గతిమాలి । బైసిమాలి.



శా. హేయంబో ఘనమో సుఖంబో వగతో । నిష్ణాళ్యనక్షామినీ
మాయావాగురఁ జిక్కియున్ మదనసా । మ్రాజ్యంబుపాలించితిన్
హాయిన్ జెందితిఁ గంటగించె విధియ । న్యాయ్యంబుగావించె నీ
నాయంగఁ దొక్కఁడు దాహరించె నకటా । నాజన్మ మింకేటికిన్.

గీ. జిలుఁగువలిపంబుతోడఁ దా । జలకమాడ
వెనుకపాటున నేఁబోయి । కనులుమూయఁ
జనుల నాచేతులన్ దార్చి । సకియఁ బాసి
విరహబాధకు లోనైతి । వెడగుభాతి.

గీ. మురళిమురళించు కలకంఠి । మోహనాంగి
లలితరతిమహోద్యాన లీ । లాకురంగి
సరసులమనంబుభేదించు । స్మరుఫిరంగి
అలఁతియే యాపె నాహృద । యాబ్జభృంగి.

క. ఇంటంగల చక్కనివా
ల్గంటిన్ బొమ్మంటి మచ్చె । కంటీ! విను ని
న్నంటుకొనె నొక్కఁ డక్కట
రెంటికిఁ జెడి కుందినట్టి । రేవడ నైతిన్

వ. ఇట్లపరిమితచింతాభరస్వాంతుండైయా హేమసుందరుండు.

మ. వలపించెన్ వలచెన్ వెలందియనుచున్ । భావించు భావించి క
న్నులమూయు న్గనులట్లమూసి సఖు నిద్దా । మించు దూమించి ది
క్కులనొక్కుమ్మడిజూచు జూచుచుఁ గడున్గో । పించుఁ గోపించుచు
న్వాపించున్ బలవించు నించుకలుకన్ । నింగాంచి నల్లించుచున్.

మ. కులుకుంబ్రాయపువన్నెచిన్నెలను పెక్కుల్పూపువాల్గంటి
పూవిలు కానిన్ వలపించుజాణమెయి । వేవేల్పుపూబోండ్లయా
దలఁదన్నంగలయందకత్తెయనుచు । న్దైవంబునోనాడుచున్
వలవంత న్దపియించుమన్మథునక । బ్రహ్మణ్యము న్పెట్టుచున్.

చ. జిలజిలపూవుఁదేనియలఁ । జిల్కు మనుద్దులఁ గుల్కు గోపికోఁ
గలకలనవ్వ నాయఁడల । కాముఁ సోముని మెచ్చునంచుఁదా
వలవల యేడ్చి యేడ్చితన । పాన్పునఁ బొర్లుచునుండ భళ్లన
న్దెలదెలవాఱెజాఱెనలు । దిక్కుల జుక్కలు కోడికూఁతతో.

సీ. తెలవాఱెబ్రిదికిటి । వలవంతయున్నుండ
నృపుఁజూచి యుద్యోగ । మొనయవలయు
ననిలేచి వేవేగ । జని స్నానముం జేసి,
దబ్బున ధౌతవ । స్త్రములఁ దాల్చి
వడిఁబోయి యానృపు । ద్వారసీమను వేచి,
తెఱఁజూచి తనరాక । నెఱుకపఱచి
సర్వౌషధంబుల । సంగ్రహించినరాజ
వైద్యుండ వెండియుఁ । బండితుండ

గీ. ననుచు వచియించి కలుకుల । నలరఁజేసి
నృపునియాజ్ఞను దలఁదాల్చి । వృత్తిఁబడసి
వచ్చుచుం బోవుచున్ రాజు । మెచ్చుకొనఁగ
బ్రదుకుచుండె రవంతయు । వంతలేక.



గీ. వైద్యమునఁ గొంత తనవృత్తి । వలనఁ గొంత
విత్త మార్జించి యన్యదు । ర్వృత్తిమఱచి
యప్పులను దీర్చి, యిల్లాలి । మెప్పుఁబడసె
బంధువులు మెచ్చుకొన హేమ । సుందరుండు.

వ. ఇట్లు వత్సరద్వయంబు వెచ్చించి

గీ. సేవకావృత్తి తగ దంచు । నెనగించి
నిఖిలదుర్జనసేవిత । నృపునిఁగొల్చు
వృత్తికిఁ దిలోదకంబుల । విడిచెఁ దుదకు
వైద్యవృత్తియె జీవనో । పాధి గాఁగ.

ఉ. సంకట పెట్టెదో యెఱుఁగు । జ్ఞానముసుంతయు లేక వేళ్ళువె
ల్లంకులు దెచ్చియౌషధము । లంగృహభాగమలంకరించి వే
షాంకితభేషజంబున ధ । నార్జనసేయుచునుండెఁ బాపమున్
జంకుఁదొలంగి నేపని నొ । నర్చుట కింక తెగింపకుండునో?

గీ. రాజవైద్యవిఖ్యాతిఁ గు । గ్రామములను
జనులవంచించి విత్తంబు । సంగ్రహించె
వానిసిద్ధౌషధంబునఁ । గాని రోగి
నాకలోకంబుఁ జూడఁడే । నాటికైన.

గీ. అమరవిభుఁడగు నూరుయా । గములవలనఁ
గవివరుం డగు నూరుశ్లో । కములవలన
వరున నూర్వురఁ జంపిన । వైద్యుఁ డగును
జ్ఞాన మట్లుండ నిందు నిక్కంబు వినుఁడు.

వ. ఇట్లు దినదినప్రవర్ధమానుండై (రాజభిషఙ్మణిమార్తాండ)
కలియుగధన్వంతరీత్యాద్యసత్యబిరుదాంకితములం బ్రకటం
చుకొనుచు, మృదుమధుర వాక్చమత్కారధురీణుండై,
సామదానసమాకర్షితకర్షకాదిజనహార్దవర్షితధన శీర్షుండై,
మదాంధుండై వెండియుఁ గాంమాంధుండై,

గీ. గోపికయ్యెడు నాయుండు దాపరించె
నారయా యాస యాయాన మయ్యెననుచు
మదిని జింతించి తుదకు మన్మధునిరాజ
ధాని యననొప్పు నొకయొడ్డసాని వలచె.

గీ. సరసనయనాభిరామ వేశ్యాలలామ
వదననిర్జితసోము, యవగుణధామ
అతులనీలరోమస్తోమ శతసహస్ర
యువకసంగ్రామసీమ యాయోధ్రభామ.

సీ. తనదుప్రియుని సుందరుని మోహించిన
యట్లు నటించి రహస్యపక్కఁ
గామాంధులౌ విటకాండ్రనాకర్షించి
యశ్రాంతమును ధనం బపహరించి
సుందరుండక్కుఁ బురందరునైనను
కన్నెత్తిచూడదీ కన్నెమిన్న
యనునట్లు మెలఁగి వైద్యాపదేశంబున
నార్జించు నాతని యర్థరాశి



గీ. సంతతము నొయ్యనొయ్యన సంగ్రహించి,
యొక్క నాడర్థరాశి నాయోధ్రభామ
యేడకో యేగె నిశ్శంకతోడ నకట
వేశ్యలను విశ్వసించి వివేకి యగునె?.

గీ. మంత్రమనుచు వైద్యంబనుచుఁ దంత్రమనుచు
జనులవంచించి యార్జించుధనము ఘనమె?
ఘనమయ్యెఁగాక యద్దాని ననుభవింపఁ
జాలునే యెట్టివాఁడైనఁ గోలుపోవు.

వ. అనంతర మా హేమసుందరుండు,

ఉ. ఆవలినాక్షి మెల్లఁగ మదార్జిత విత్తముఁ దొంగిలించి మో
మైనను జూపకుండఁ జనెనంచుఁ గనుంగొనుఁ గుందుచుండ నా
లోనొకఁ డేగుదెంచి, మన లోకము వాఁడనరాదు నాయఁడ
జ్ఞానదశన్ బరుండెనన గావిని యొంతయు సంతసించుచున్.

ఉ. పాపము పుణ్యమో యెఱుఁగు భారము దైవము మీఁదనుండు
జూ, పాపమి వేఁగివేఁగి మదినొంకుదలంపక మిన్నకుంటినా
గోపినిఁ గోలుపోయి కడుఁగుంది కృశించితి నేఁడు నాదు సం
తాపమణంగె, నాయనికిఁ దప్పదు చావు, విషంబొసంగెదన్.

వ. అని నిశ్చయించి యక్కపటవైద్యుండు,

ఉ. పండినపంట్లకై పిలుచు నైఖరి వచ్చినవాఁడు "వేగమే
రం"డనుచుండ నౌషధకరండముఁ గైకొని ధౌతవస్త్రముల్

మెండుగఁదాల్చి, నవ్వుచును । మీసముదువ్వుచు రాజమార్గమం
దండజయానలం గనియొ । య్యారముఁ జూపుచు మాటలాడుచున్.

చం. చనిచని రాజవీధిఁ గల । సౌధమునన్ నివసించు నాయనిన్
గని యెటులుండెఁ జెప్పుడని । నన్ వినియాతఁడు శూలబాధకున్
దనువు వశంబు గాదనిన । నవ్వుచు "మేలగు నౌషధం బొసం
గిన"నని హస్తనాడిఁ బరి । కించి యొసంగె విషంబు నిర్దయన్.

గీ. ఆతఁడు విషంబు సేవించు । నంతదాక
వేచి, నిద్రింపుఁడని చెప్పి । వెడలివచ్చి
యితరులం జూచి నాయఁడు । బ్రతుకఁ జాలఁ
డనుచు వచియించి, యాత్మగృ । హంబుఁ జేరె.

వ. అంత,

గీ. ఘోర నాయండు గతియించె । ననెడివార్త
యఖిలదిక్కుల వడివడి । నాక్రమించె
ప్రళయకాలకల్లోల వా । రాశిలీల
నల్లకల్లోలమైయుండె । నాపురంబు.

సీ. ప్రాణాంత మానంత । వ్యాధిలే దనువార
లాయువింతకు స్వల్ప । మనెడువారు
దానమందంతటి । త్యాగిలేడనువార
లైననించుకలోభి । యనెడువారు
హేమసుందరుం డౌర । ఘనవైద్యుఁ డనువార
లమృతహస్తుండుగా । దనెడువార



లనుమానముగనున్న । నదియేమొ యనువారు
మన కేటి కామాట । యనెడువార

గీ. లవని శాశ్వతం బెయ్యది । యనెడువారు
జనులు పుట్టుట గిట్టుట । కనెడువార
లిట్లు కొందఱు నందఱు । నెల్లయెడలఁ
బొక్కిపొరలిరి పురపుర । పురమువారు.

గీ. చంపఁ దలపెట్టి ఘోరవి । షం బొసంగె
ననెడు దుర్వార్త యంతట । నాక్రమించి
యింత యంతయ్యె నంత మ । హింతయయ్యె.
సుందరుని వైద్యవృత్తియు । శూన్యమయ్యె.

గీ. ఉన్నధనమంతయు హరించె । నోఘ్రిభామ
వైద్యవృత్తితో క్షీణించెఁ । బలుకుబడియు
ననుచుఁ జింతించి గోపికి । నభయమిచ్చి.
ధనము వెండియు నార్జింపఁ । దలఁచి తలఁచి.

ఉ. "పాటలగంధి గోపి నెడ । బాయఁగరాదు పురంబునందు నా
యాటలు సాగిరా" వని । నిజాత్మఁ దలంచి మఱొక్కయూరిలో
మాటల నేర్పునన్ మగుడ । మందులనిచ్చెద నింతవంతనా
కేటికిఁ; బూరి మేపిదు న । సృష్టియొనర్చిన దైవమక్కటా.

సీ. తనకు దక్షిణబాహు । వననొప్పు నాయనిఁ
జంపితి రెడ్డి కో । పింపకున్న?

తనప్రాణసఖునిఁ జం।పిన నన్ను భూపతి
వీక్షించెనేని చం।పింపకున్న?
విష మిచ్చి నాయనిఁ । బిలుకుమార్చితి వాని
యిల్లాలు ననుఁజూచి । యేడ్వకున్న?
జనరంజకునిధనిం । జంపితి వానియా
శ్రితకోటి నన్ను దూ।షింపకున్న?

గీ. పౌరబృందంబు పాషాణ।వైద్యుఁ డనుచు
నన్నుఁదిలకించునపు డాత్మ । నెన్నకున్న?
చాలు నీపురి కోకనమ।స్కారశతము
బ్రదికియుండఁగ నొండు।పురంబు లేదె.

వ. అని నిశ్చయించి యాదుష్టవైద్యుండు కుటుంబసహితుం డై గోపియు వెంటరా, నర్ధరాత్రంబున నతిరహస్య ప్రకారంబునఁ దత్పురంబాసి చనియె.

—। ఆశ్వాసాంతము ।—

చ. సరసిజపత్రనేత్ర, శివ।సన్నుతదివ్యచరిత్ర సత్కవీ
శ్వరనుతకీర్తిపాత్ర నిజ।భక్తజనాఘలతాలవిత్ర ని
ర్జరనుతజైత్రయాత్ర వర।రాట్కులకాననవీతిహోత్ర సుం
దరతరనీలగాత్ర, నత।దానవమిత్ర పవిత్రగోత్రజా!.

కం. వరమునిసరసిజభాస్కర
కరధృతశితఖడ్గచక్ర।ఘటితయశోభా



సుర, సురదానవపూజిత
చరణాంబుజ యంబుజభవ । సన్నుతచరితా.

భుజంగప్రయాతవృత్తము.

యశోవాహినీక్షాళి।తాంభోజవైరీ
యశోదాయశోదామ।హత్కార్యకారీ
ప్రశాంతాల్పహాసస్ఫు।రత్పాండునేత్రా
నిశాటాన్వయధ్వంస।నిర్ణీతయాత్రా.

గద్య:— ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష ప్రసాదిత
సత్కవితాలతా ప్రసూనాయమాన నవీనప్రబంధం
బైన హేమసుందరోపాఖ్యానము
నందుఁ బూర్వోదంతంబను

ప్రథమాశ్వాసము.



శ్రీరామచంద్రాయనమః

శుభమస్తు — అవిఘ్నమస్తు



# ద్వితీయాశ్వాసము.



కం. రామా! వదననిర్జిత
సోమా! జితపరశురామ । సుగుణస్తోమా!
శ్యామానుతనవమేఘ
శ్యామా! లోకాభిరామ । సంగరభీమా.

గీ. అవధరింపుము నీకు నా । మాంకితముగ
నొప్పిదంబుగ నిప్పుడు । చెప్పఁబోవు
నవసుధారసమిళిత సూ । నమకరంద
బిందుసందోహమైన స । జీవగాథ.

మ. కలదుత్తుంగతరంగరంగము లనం । గంగాద్రిలు సౌధంబులన్
జెలువున్ మీఱి సుధారుచిన్ దనరు నా । క్షీరాంబుధిం బోలి, చం
చలదంభోరుహమై, వణిగ్జనులకున్ । సంస్థానమై ప్రాణమై
కలనాదం బనుపట్టణంబు భరత । క్ష్మామండలీ రత్నమై.



చం. జగమున నెందుఁ జూడని వి । శాలవనంబుల నందడించు నా
ఖగముల కాకలీకలవి । కస్వరరావముతోడఁ గూడి, త
న్నగరనవీనగానకల । నాదము దిక్కులఁ బిక్కటిల్లుటన్
దగునని పెద్దలెల్లఁ గల । నాదము పేరిడి రింపునింపఁగన్.

చం. పరభృతమా పురస్థవర । వారవధూకల నాదమాధురీ
గరిమకు నోడి, వాణి కయి । గాఢతపఃక్రియ లాచరించి త
ద్వరమహిమన్ వహించినది । భాస్వరసుస్వరమాధురిన్ వసం
తఋతువునంద; లేనియెడఁ । దక్కిన వేళలఁ గూయకుండునే.

గీ. వారకామినీసంగీత । వైభవమున
శారికాకీరకలనాద । కారణమున
నరయ నాపేరు సార్థకం । బగును గాక;
పూర్వ మాపురవర మొప్పు । ముక్తయనఁగ.

మ. ఘనసౌధస్థసతీమణీకరయుగో । త్ఖాతాంబరహ్రాదినీ
కనకాంభోరుహకాండతాడితనభః । కాంతామణీకుట్మల
స్తనహారభ్రమిముక్తముక్తలను సౌ । ధశ్రేణి రాజిల్లుటన్
మును పాపట్టణరాజ మొప్పెఁ బుడమిన్ । ముక్తాహ్వయఖ్యాతితో.

చం. అనిశము సాలభంజికల । యందమునన్ జెలువొందు మేడలన్
ఘనములఁ దత్తటిల్లతలఁ । గాంచి విటుల్ కబరీభరంబుగాఁ
గనకసమానవర్ణతను । కాంతులుగా నల సాలభంజికల్
వనితలుగా భ్రమించి కను । పట్టుదు రప్పురిఁ గేలు బొమ్మలై.

సీ. తడఁబాటునకుఁ గాదె । తలకొట్టువడ బ్రహ్మ
యనియెన్న రతిని సాధ్యయనపరులు
పోట్లాడఁజాలక । పోటయయ్యెనరుండు
పోటయేయుండ్రి రాపోటుమగలు
కుడువనా పెట్టనా । కూడఁబెట్టె కుబేరుఁ
డార్యుఁడేయని యందు । రర్యజనులు
వీడు వీటింబుచ్చు । వాఁడేటి నాగేటి
జోదండ్రి ముసలిని । పాదభవులు

గీ. ఆత్మధర్మంబుఁ దప్పని । యనఘు లెపుడు
న్యాయమార్గంబు విడువని । యలఘుమతులు
మోస మిసుమంత లేని సు । బుద్ధులతుల
భక్తు లౌర చతుర్వర్ణ । పౌరజనులు.

ఉ. కచ్చియయ్యుందుఁ జేకురిన । గాయము కాయమునందుభూషగా
మెచ్చులఁగాంచి వైరులకు । మృత్యువుసంఘటిలంగఁ బోరి వి
వ్వచ్చుఁడువచ్చుఁగాక యల । భర్గుఁడువచ్చినవచ్చుగాక, రా
లచ్చికిహాని లేదని చె । లంగుదు రచ్చటి పాదసైనికుల్.

మ. అభిమానంబు రతిప్రసంగములయం । దాసక్తి దుర్మార్గులా
పభిక ప్రాణములన్ మెలంగుటయు సా । త్యాహిత్యచాంపేయ సా
రభమున్ వాసవఁజూడనట్టి మధుప । ప్రఖ్యాతివేశ్యాంగనా
శుభలందాండవమాడు వైశ్యులదురా । చారంబు లగ్రాహ్యముల్



గీ. వేల్పుమ్రాని కొమ్మలవాడు । వేల్పుఁగొమ్మ
లనిశమున్ గోటకొమ్మల । నాశ్రయించి
దేవతటినికి, ఖేయవా । ర్ధికిని బెండ్లిఁ
జేయఁబోలదే యంచు వ । చించుచుండ్రి.

సీ. మాకుంభకరినత । మానినీ స్తనములు
దొంగిలించినవంచు । ధూళియెత్తి
మదమింక స్తనముల । మర్దింపుఁ డనునట్లు
ధ్వనిఁజేసి పీనకుం । భములఁజూపి
మామందగమనంబు । మగువనేర్చెనుగాక
మముఁబోలదనుచు మం । దముగ నడచి
దిగ్గజంబులు మాకు । మొగ్గియుండు ననంగ
నలుదిక్కులకును తుం । డములుసాచి

గీ. యందమున కోడి తెలఁబాఱు । టట్టులుండె
దానమున కోడిగాదె పా । దములనాశ్రి
యించె మేఘంబుఘనమె మా । కెందుననుచు
గజము లప్పురరాజమా । ర్గములఁగ్రాలు.

సీ. విటపమాత్రంబుగ । నటవీస్థలిం జేసి
త్వష్ట్రమండలంబు గోష్ఠముగఁ జేసి
పాత్రస్వాతినిఁజూచి । సూత్రమాత్రముఁ జేసి
వార్ధిలంఘించి పల్వలముఁ జేసి

సప్తశైలంబుల । సర్షపంబులఁజేసి
లోకత్రియంబు క్రోడీకరించి
యొప్పఁగ నుప్పరం । బొక్కఁడొప్పఁగఁజేసి
వాతావరణము స్థావరముఁజేసి.

గీ. పృథుఖురవిఘాతసంభూత । విస్ఫులింగ
రుచులకినునిఖద్యోతమా । త్రినిగఁజేసి
కనఁబురంగములాకురం । గము లనంగ
వరతురంగములగము లా । పురిఁజెలంగు.

సీ. తనయశస్సౌరభ । తతిదిక్కులఁజెలంగ
మధువనంబులనేలు । మాధవుండు
తనదుహార్వినా । దము దిక్కులధ్వనింప
వాహ్యాళిసాగించుఁ । బంచశరుఁడు
తనపండువెన్నెల । వనితలఁగరఁగింప
సౌధవీథులఁజూచుఁ । జంద్రమసుఁడు
తనగంధవహనామ । మును సార్థకముఁజేయ
గంధంబువెదజల్లు । గంధవహుఁడు

గీ. తనమనోహరకలనాద । మినుమడించి
పాటలంబాడు నెలుఁగెత్తి । పరభృతంబు
పౌరజనమనోల్లాసమే । పరుసనుండుఁ
బలుకశక్యంబె? యూహింప । పలయుఁగాక.



గీ. మలయగిరి చందనశ్రీల । మాటయేల?
దేవవనసౌరభశ్రీలఁ । దెచ్చి చల్లు
నచటితోరణంబుల మల । యానిలుండు
వలచి వలపించునో పురిం । గలజనాళి.

ఉ. దండకుఁజేరిపల్లవుఁడు । "దండయొకించుక యెత్తిచూపుమీ
యండజయానవిల్తు"నన । "నాబది వే"లననామె, యోర్తయా
చండికకంటెసీకుసర । సమ్ముగనిచ్చెద రమ్ము రమ్ము నా
దండలకం చునమ్ముదురు । దండలఁదత్పురిఁ బుష్పలావికల్.

సీ. మోవిపానక మిచ్చి । ముద్దారఁ గ్రీడించు
నాత్మయౌవనజీవ । రత్న మనుచు
బ్రియవాక్యచతురిమన్ । విటులను వంచింప
యత్నించుఁ బోనాగ । రత్నమనుచుఁ
జనుదోయిఁ జూపించి । కనుదోయిఁ జీరు వా
మాక్షి రా యారకా । మాక్షి యనుచు
ధన మిచ్చినంతన । చనవిచ్చి కడుమెచ్చి
భోగించురా పద్మ । రాగ మనుచుఁ

గీ. బండువెన్నెల మెండుగ । నిండుకొనిన
వేళ వేశ్యవాటికలందు । విటులుగూడి
మాటలాడుచుఁ బాడుచు । మలయుచుండు
రప్పురము సొంపు వర్ణింప । నలవియగునె?

గీ. అమరభోగినీనిరతసంగమమువలన
నమరవిభుఁడు సహస్రవ్రణాంకితాంగుఁ
డైనసహస్రాక్ష విఖ్యాతి నలరునందు
రచటి విటులు భోగగరిష్ఠులైన యపుడు.

గీ. పురవనేందిర వచ్చకప్పురపుటనఁటి
యాకులను హస్తములఁ జాఁచి నాకమునకు
నందనోద్యానమహిమాభినందనంబు
వలదు వల దంచు వలపులఁ దొలకరించు.

గీ. అన్యభూపాలు రెల్లఱు నభినుతింపఁ
బౌరు లారోగ్యభాగ్యసంపదలఁ బొదలఁ
మేలుమేలనఁ దత్పుర మేలుచుండుఁ
జంద్రచూడాఖ్యభూపాలచంద్రుఁ డొకఁడు.

గీ. రాజమాత్రుండె? యామసారంగ విపుల
కర్ణపుటమారుతోద్ధూతకాలమేఘ
గర్జనచ్ఛల సన్నుతఘనగుణగణ
రత్నపూరితకాండకరండుఁ డతఁడు.

ఉ. భూతల నాకలోకమని భూజను లెల్లఱు సన్నుతింపఁగా
నాతనిపాలనంబున నిరామయమై పుర ముల్లసిల్ల నా
పేరిపురాధిపుండు గని పేరితవనం బొనరింపఁబంపెనో
ఘాతుకు నాతతాయి ననఁగా జనసుందరుఁ డార్జవార్థియై



వ. దుష్టవైద్యశిఖామణి యగు నాహేమసుందరుండు తత్పుర
ముం బ్రవేశించి, యందు నివసించి,

ఉ. తమ్ముఁడుఁదోడుగాఁగఁబిన తండ్రియు మేలని హెచ్చరింపవై
ద్యమ్మునఁగొప్పవాఁడనని దబ్బఱలాడుచు మోసపుచ్చి, వి
త్తమ్ము హరించుచుండె నిజధర్మపథచ్యుతకార్యమంచు చి
త్తమ్మున నెంచఁ డయ్యె నిది తప్పని చెప్పెడివార లెవ్వరో?

వ. అశ్వినీదేవతావరప్రసాదలబ్ధవైద్యవిద్యాపారగులమనియా
సోదరు లిరువురుం గూడి తత్పురంబున సమీపగ్రామం
బుల సంచరించుచు ననేకజనంబుల యమనిశాంతంబున
కతిథులం జేయుచుఁ గ్రమక్రమంబున నెల్లయెడల వాఙ్నై
పుణ్యంబునఁ బామరజన సన్మానంబుఁ బడసి,

ఉ. స్వోదరపోషణార్థమయి యుచ్చము నీచముఁ నెంచకుండ భా
గ్యోదయలబ్ధికా నవడి యుత్తమనీతిఁ బరిత్యజించి సంపా
దితఘోరపాపులయి మందుల మాఁకుల విక్రయించుచున్
సోదరరాజవైద్యు లనుచుఁ బ్రకటించిరి తత్పురంబునన్.

గీ. సిద్ధమకరధ్వజం బంచు శుద్ధమైన
పూర్ణచంద్రోదయం బంచుఁ బుష్పబాణ
పంచబాణ బృహద్ధాతువర్ధనాది
రమ్యవాసంత కుసుమాకరంబు లనుచు.

సీ. శతపుటాభ్రకమంచు శతపుటవజ్రాభ్ర
కంబంచు హరితాళకంబు లనుచుఁ

గనకాభ్రకంబంచుఁ । గాంతాభ్రకంబంచు
లోహాభ్రకంబంచు । లోహమనుచుఁ
గాంతలోహంబంచు । ఖడ్గలోహంబంచు
వైక్రాంతమనుచుఁ బ్ర । వాళమనుచు
ముండలోహంబంచు । భూరినాగంబంచు
హేమాక్షికంబంచు । హేమమనుచుఁ

గీ. గాంస్యవజ్రముక్తావంగ । కఫరి తామ్ర
శంఖ రజిత కాసీస ర । సంబులనుచు
భస్మనామాళి నానర । ఘుస్మరు లొగి
విక్రయించుచు నార్జించి । రక్రమముగ.

సీ. శ్రీవిష్ణుచక్రంబు । శ్రీకాలకంఠాగ్ని
కాలాగ్నిరుద్రంబు । కాలకూట
మమృతాంశురసము మ । హాజ్వరాంకుశము నా
రాయణాస్త్రము వాత । రాక్షసంబు
బ్రహ్మరంధ్రంబు స । వగ్రాహికఫకేతు
సూతికాభరణంబు । సూర్యరసము
తరుణార్క మత్యగ్ని । తరుణార్క మతిసన్ని
పాతభైరవి మహా । వాతహారము

గీ. సన్నిపాత సూర్యావర్తి । చండభాను
వనుచు నానావిధౌషదా । హ్వాయములెల్ల



నేర్పి కొన్నివిషంబుల । నేర్చి కూర్చి
పాప మారాజవైద్యులు । బ్రదుకుచుండ్రి.

వ. ఇట్లు,

ఉ. ఏహ్యములైనమూలికల । హీనపదార్థములన్ గ్రహించి య
గ్రాహ్యములైనతైలములఁ । గానియుఁ జేయని యౌషధంబుల
న్లేహ్యములన్ ఘృతంబుల వి । లేపములన్ బరికింపఁ గేవలా
సహ్యములైనభస్మముల । శాస్త్రవిరుద్ధముగా నొనర్చుచున్.

వ. హేమసుందరుండు, సోదరసహితుండై ధనం బత్యధికంబుగ నార్జించె.

మ. చరకాద్యుత్తమవైద్యశాస్త్రవిధులన్ । జర్చింపఁగా నేల? నూ
ర్వరఁ జంపంగలవాఁడు వైద్యుఁడగు నూ । రుం బేరు లేనట్టి దుశ్చ
రితుండయ్యును; వాఁడు పండితుఁడో? శా । స్త్రజ్ఞానమే పాటి యో
యెఱుఁగంజాలినవాఁడు లేఁడు పురమం । దెలా వితర్కింపఁగన్.

గీ. నిజపిచండభాండములను । నింపుకొఱకు
వృత్తిధర్మమెఱుంగక । విషమయౌష
ధములనిచ్చి మృషాకషా । యముల నొసఁగి
ప్రజలవంచింతురీదుష్ట । వైద్యులకట.

ఉ. ధాతుపరీక్ష దేహముల । తత్త్వమువస్తుగుణంబు శాస్త్రని
ర్ణీతపథంబు నోషధుల । నేమము సర్వరుజానిదానమున్
బ్రీతిగనేర్చి పైనను భ । విజ్ఞులఁ బెద్దలనాశ్రయించి యా
జ్ఞాతరహస్యయోగముల । సారమెఱింగిన వైద్యుఁ డెవ్వఁడో

గీ. శాస్త్రపరిచయహీనులు । శస్త్రపరులు
భక్షితాశేషమానవ । వ్రాతులైన
మూఢవైద్యుల వైద్యంబు । రూఢి కెక్క
శ్రాద్ధదేవుండు నేఁడు వి । శ్రామ మొందె.

సీ. అద్వైతవిద్యార । హస్యంబుల నెఱుంగ
భ్రాంతి మీ కేల వే । దాంతులార
కర్కశవాక్యాలం । దర్కించి బాధలొం
దగ నేల తర్కశా । స్త్రజ్ఞులార
శ్రోత్రశూలములైన । శ్రుతివాక్యములతోడఁ
బని యేమి శ్రోత్రియ । వర్యులార
అర్థంబు లేక శ । బ్దార్థంబు కొఱ కింత
చింత యేటికిఁ గవి । శ్రేష్ఠులార

గీ. గణిత మని చావ నేటికి । గణకులార
వ్యాకరణ మేల శాబ్దిక । ప్రవరులార
ధర్మమేటికి ధర్మశా । స్త్రజ్ఞులార
ప్రజల వంచించి బ్రదుకుఁడు । వైద్యమునను.

గీ. నాడిఁ జూచు నెపంబున । నారిఁ జేరి
పాణిగ్రహియించి భాషింప । వచ్చు నార
వైద్యమును మీఱు న । నవద్యవిద్య గలదె?
హేమసుందర ధన్యుండ । వీవ భువిని.



గీ. తొలుత లజ్జాపులకితాంగ । ములస్పృశించి
బాలరండల వలపింప । వచ్చు నార
వైద్యమును మీఱు ననవద్య । విద్య గలదె?
హేమసుందర ధన్యుండ । వీవ భువిని.

గీ. వారవనితాపరిష్వంగ । వైభవంబు
వైద్యనెపమున సతతంబుఁ । బడయవచ్చు
వైద్యమును మీఱు ననవద్య । విద్య గలదె?
హేమసుందర ధన్యుండ । వీవ భువిని.

గీ. పుంస్త్వ ముదయించు ననుచు న । పుంసకులను
వంచితులఁ జేసి యార్జింప । వచ్చు ధనము
వైద్యమును మీఱు ననవద్య । విద్య గలదె?
హేమసుందర ధన్యుండ । వీవ భువిని.

గీ. సంతతి జనించు ననుచు నౌ । షధములిచ్చి
వంధ్యలను మోసపుచ్చెడి । వైద్యవరుఁడ
వౌర! నీవైద్యనీతి వం । ధ్యాప్రసూతి
హేమసుందర ధన్యుండ । వీవ భువిని.

వ. అట్టి యాయాయుర్వేదశిఖామణి యొకనాఁడు,

గీ. ప్రజ్వలించుచుఁ గాలు శ । వంబుఁ జూచి
చోద్యముం బొందె భళిర! నా । సోదరుండు
లేఁడు, నేనూరి కేగిన । వాఁడ నహహ
యిట్టి హస్తలాఘవవైద్యుఁ । డెవ్వ డనుచు.

వ. ఈయంశ మిట్లుండ,

ఉ. బేరముసారముంగల కు। బేరుఁడు వైశ్యకులోద్భవుండు బే
హారులకెల్ల నేలిక మ। హాధనవంతు లవేళలకులం
గోరినసత్వరంబె సమ। కూర్చు ఘనుండననొప్పునొక్కఁడా
యూరవసించువేశ్యలకు। నుండునె లేమియొకప్పుడేనియున్.

ఉ. ఆతఁడు రాజవైద్యులగృ। హంబుననున్ మకరధ్వజాదివి
ఖ్యాతమహౌషధంబులను। గైకొనవచ్చినయట్లువచ్చి వా
రాలెటె నింటలేకునికి। నచ్చటగోపినిజూచి యామె వా
క్చాతురికుల్లసిల్లె సుమ। చాపవిముక్తశరాహతాత్ముఁడై.

గీ. సరససల్లాపచాతురీ। సరణిఁ జూపి
వానిహృదయంబుఁ గరగించి। వానితోడ
నొందుదలఁపక పున్నెంబు। పండెననుచు
వెడలె నాగోపి లంజల। విడువదగదె?

చం. తనవల పేవగించి సత। తంబును దొత్తులపొత్తుఁ గోరు నా
ధునివలపించి యింటఁదన। తోఁదులదూగుచు ధిక్కరించు నా
వనితతనంత నేగృహము। బాసితొలంగినదంచు నెంతయున్
మనమున సంతసించెఁ గుల। మానిని సుందరుఁ డాగ్రహింపగన్.

చ. సతముగృహంబునహృదయ। శల్యముకైవడి సంచరించుచున్
బతినెడఁబాయకుండు ధన। భామినిపోకకు సంతసించె నా
సతి; పతి వెండియున్ ధన మొ। సంగిన వేశ్యలభింపకున్నె? దు
ర్మతియగుభర్తఁ దిప్పుకొను। మార్గమెఱుంగరుముగ్ధలక్కటా!



చం. కులటతొలంగెనంచుఁ బతి। కొంగుకుసిం డిగనుండునంచు నా
కులసతిసంతసించె మది। గోరికలీరికలెత్త; నక్కటా
వలపురవంతలేని తమ। భర్తలనేలుకొనంగలేక వే
శ్యలనెరసుల్ గణించి ముద। మందినభార్యలుజాణలౌదురో.

— హేమసుందరుని మనస్తాపము —

ఉ. "అక్కట దొంగలంజె వల। పంతయువంతకువడ్డిగాగ నన్
దక్కితొలంగె; నేవరున। దాశదఁ? దాశదఁగాక; తాళునే
తక్కిడుకాఁడు తుంటవిలు। దంటబొజుంగుల నుండనిచ్చునే
యెక్కడకేగు? నేవిటుని। యింట మెలంగునెఱుంగవచ్చునే?

ఉ. రూకలొసంగలేక మ। రోసితినో? చెలువారు మేల్జరీ
కోకలనీయఁజాలన। కుందితినో కలనైన? నిట్టిపె
పోకకునెట్టికారణము। బుద్ధికి సుంతయుఁ దోచకుండె; న
త్రాకులబెట్టి యేగె నవు। రా వెలచానలవిశ్వసింతురే.

సీ. పచ్చపూసాదిగ। హెచ్చుగవెచ్చించి
కొంపబచ్చులకెల్లఁ। గుదవబెట్టి
పొంకంబు జనుదోయి। బింకంబుఁదప్పని
యిల్లాలిసొమ్ములఁ। బెల్లగించి
సద్ధర్మములఁ బాసి। సంచరించుటకుఁగాఁ
జింతించుతండ్రికిఁ। జిచ్చుబెట్టి
నీతికిదూరంబు। జాతి యోర్చునయంచుఁ
దెలుపు పెద్దలదిట్టి। ధిక్కరించి

గీ. ధనము ధన మంచు నాయనిఁ । దాఁచె నోర్చి
తనకుఁగా ఘోరవిషము నా।యనికి నొసంగి
తన్ను దేవేరిగా నెంచు । నన్ను ద్రొత్తు
కూతు రెడఁబాసె నక్కటా । కొంపదీసె.

ఉ. ఇచ్చకమాడ నేర్చు విటుఁ।డెవ్వఁడొ మందు నెపాన నింటికిన్
వచ్చి లతాంగిఁ జూచి నయ।వాక్కులఁ జక్కఁగ మోసపుచ్చి, నీ
యిచ్చకు వచ్చినట్లు ధన।మిచ్చెద మెచ్చెదనంచుఁ జెప్పి తాఁ
జెచ్చెరఁ గొంచుఁ బోయెఁ జెలి। చెక్కుల నొక్కి రమింపకుండునే.

ఉ. నమ్మితి నింటఁ బెట్టి గృహ।నాయికఁ జేసితి దాని స్నేహమో
హమ్ముల మందహాస పరి।హాస విలాసములన్ గరంగి రా
రమ్మని మోసపుచ్చె నవు।రా విటుఁ డెవ్వఁడొ? దొంగలంజె నా
నెమ్మిఁ దలంపకుండఁ జనె; । నేటికిఁ దీరె ఋణానుబంధముల్.

ఉ. చెక్కుచెమర్పకుండ సిరి। బిందులు ద్రొక్కుడు నింటఁ బెట్టినే
నక్కున గారవించితి; నొ।యారి నను న్గికురించి యేగునే?
ఎక్కడికేగెనొక్కొ? యెటు। లీదెద ఘోరవియోగసాగరం
బక్కట! నేను నాదు గృహ।మంతయుఁ బాడఱె నేమి సేయుదున్.

ఉ. కక్కసమయ్యె నావలపు। కానన చంద్రికయయ్యె సొంపు; నే
నెక్కడ వానిఁ జేరుటది। యెక్కడ? యింతకుఁ దెచ్చె మన్మథుం
డెక్కడ వాని నోర్చుటది। యెక్కడ? వెండియుఁ జిక్కునొక్కొ న
న్నెక్కడ? దేవలోకమది। యెక్కడ? హా! విధి కంటగించెనే?



ఉ. చక్కని కన్నుఁ దోయి, రతి। సంగతి కుబ్బుచుఁ గేలు దోయికిన్
జిక్కని చన్నుదోయి, నునుఁ। జెక్కులఁ జూచిన ముద్దులూరు కెం
పెక్కిన మోవి, మైవిరుపు । లెప్పటి కప్పుడె సొంపులీనుఁ గా
నెక్కడఁ గానరాదు రమి।యింపుల కింపు లునింపు; నక్కటా
యక్కనకాంగిఁ బాయఁగల।నాయిల నాదు శరీరముండఁగన్.

ఉ. పాటలగంధి గోపి నెడఁ బాసితి । నార్జితమైన యీధనం
బేటికిఁ? బేటికింక యశ। మేటికి? వీటికి; నిందుజవ్వనం
బేటికి? నేటి కింక బ్రదు। కేటికిఁ? గాటికి; సౌర బోటికిన్
మాటికి మాటికిన్ వెతల। నుందెద గుందెద నేమి సేయుదున్.

సీ. విత్తమ్ముఁ దెమ్మని । చిత్తమ్ముఁ గొమ్మని
వలపించి వలచిన । వలపుకత్తె
ప్రేమించి రమ్మని । కామించి కమ్మని
ముద్దులిచ్చిన నాదు । ముద్దుగుమ్మ
మనువిచ్చి బ్రతిమాలి । ననుమెచ్చి రతికేళి
కిచ్చగింపఁగఁ జేయు । మెచ్చులాడి
వగలనల్లనఁ జూచి । నగలు ఘల్లన లేచి
యలరించి యలరిన । యలరుఁబోణి

గీ. హావభావంబులకుఁ బేటి । యావధూటి
వలపు బంగరుబొమ్మ సొం।పలరుకొమ్మ
తొంటి నాసాని మానినీ । యింటిదాని
నేల నెవ్వాఁడు గోరు? నా। కేలపోరు?

వ. ఇట్లు,

మ. వెతలం బెట్టిన దంచు సుందరుఁడు గో।పీమోహవాపీసరో
న్నతిలోఁ స్నానముఁ జేయు భాగ్యమది శూ।న్యంబయ్యె నంచున్గడు
న్ధృతిహీనుండయి యున్న పాపజనితా।ర్తిం దూలుఁ రోగింబలె
న్మతిఁదప్పెన్ గతిఁదప్పె; దుర్గతియు సం।ప్రాప్తించు నింతేటికిన్

వ. మఱియు నామూఢుం డప్పుడప్పుడు నిజకాంతంజూచి యే
వగించుటయుఁగాక తన్నలరింపంజేయు తలంపునఁ గుల
సతి,

సీ. దువ్వెన చేఁబూని । దువ్వుచుండెడు వేళఁ
"గొప్పూడిపడు" నని । డప్పుచుండు
ముకురంబు చేఁబూని । బొట్టుదిద్దుచునుండఁ
"జక్కనిదానవే । చాలుఁ" డనును
పైఠిణీఅవికెపై । పైటజాఱుటఁజూచి
"ఊఁ మొత్తుకొన్నట్టు । లున్న" దనును
మురియుచుఁ దనతోన । ముచ్చటింపఁ దలంప
"నోరున్నదా" యని । నొవ్వనాడు

గీ. సొగసుఁ గన్నులఁగాటుక । సొగఁదీర్చి
యలరినం గనుంగొని "లంజ । వ" నుచుఁదిట్టు
నయ్యతిరుపతిపరపతి । యమ్మయనుచు
గూన్యులువచించు నార్యోక్తి । మఱచె నేమొ?

వ. ఇట్లనవరతము,



క. కుటిలాత్ముఁడు సుందరుఁ డా
కుటిలాలక నాత్మ నెంచి । కోపించుచు, దు
ర్విటుఁ డవ్వఁడో గొనెనని, యు
త్కటముగ శోకించుచుండెఁ గామాంధుండై.

ఉ. అంతవసంతమొంతయు వ।నాంతనితాంతలతాలతాంత భా
స్వాంతమ; నంతరీకృత వి।వాహమహోత్సవసంతతారవా
క్రాంతమ; కుంతకంఠకల।కంఠవధూకలనాదపూరితా
శాంతమునై విరాజిలె దు।రంతవియోగసతీకృతాంతమై.

వసంతఋతువర్ణనము.

సీ. కరమింపులనునింపు । కరకంకణధ్వనుల్
శారికాపంక్తికిఁ । జదువుసెప్ప
నడయాడువేళ ఝు।ణన్నూపురంబులు
హంసకాంతలఁజీరి । యాదరింప
మేఖలాకింకిణీ । మేదురక్వణముల
నంగుగుణధ్వని । సంగమింపఁ
దాటంకమణిగణ । ధగధగ రోచులు
మందహాసములకు । విందు లొసఁగ

గీ. మాధవుండేలు నుద్యాన।వీథులందు
సతము వాహ్యాళిసాగించు।సతులవదన
పద్మముల నవలోకింప । భాస్కరుండు
స్యందనంబునుబోనిచ్చు । మందగతిని.

గీ. పాతగుట్టంబులనుమార్చి । నూతనముల
సంఘటింపంగ మదినెంచి । సత్తురంగ
కోటికుత్పత్తిభూమియై । కొమరుమిగులఁ
నుత్తరాశకు వెడలెఁబో । యుష్ణకరుఁడు.

గీ. మంజరీరేణుపింజర । మంజుగాత్రి
పికము, కాకపిహితచూత । వృక్షమునను
కంఠమాధుర్యగరిమ, వ్యక్తత్వమొందె;
సత్కృతులచేఁ గులీనుని । చందమునను.

గీ. అనలచుంబితకేసరుం । డవనిజాద్రు
తాశయుండు, ప్రసన్నతా । రాధిపుండు
విధురరామాతురాపాంగ । వీక్షితుండు
మాధవుండురాజిలె హను । మంతుఁ డనఁగ.

గీ. పల్లవారితమగ్నియై । పరిజ్వలించె
వరపికద్విజమంగళ । ధ్వను లెసంగె
మందగతి వీచెఁ బవనుండు; । మాధవుండు
పుష్పవతియైన వనలక్ష్మిఁ । బొందువేళ.

సీ. సతతంబు నవవిలా । సంబుల శోభిల్లె
వారాంగనం బోలి । ప్రమదవనము
చోరుని చందానఁ । గ్రూరశరంబులఁ
బాంథులఁ బీడించెఁ । బంచశరుఁడు



వనితోపమితలతా । పల్లవవితతిని
శృంగారరసము మూ । ర్తీభవించె
ముగ్ధకాంతాలజ్జఁ । బోలి క్రమంబున
రాత్రిభాగంబు కార్శ్యంబుఁ బొందె

గీ. సరసుఁ డగు మాధవునిఁ గూడు । సమయమునను
వనతలేందిరా కృతగళ । స్వనము లనఁగ
పికశుక ధ్వను లెల్లెడఁ । బిక్కటిల్లెఁ
బలుకశక్యంబె పరికింప । వలయుఁ గాక.

సీ. మలయజ సౌరభం । బులఁ బూని యేతెంచి
నిర్ఝరౌఘంబుల । నెమ్మిఁ గాంచి
అరవింద మకరంద । మిరవొందఁగ వహించి
మదవదళివ్రాత । మద మణంచి
ద్రవిడకాంతాభ్యంత । రంబుల విహరించి
యతుల రతిస్వేద । మపనయించి
ప్రమదావనంబుల । బహుభంగుల రహించి
కుసుమరజంబు ది । క్కులను నించి

ఆ. మంజరీపరీత । కుంజంబు గుంజించి
పుష్పవతుల లతల । పొందు లెంచి
పంచశరుననంగు । బలవంతు నోసరించి
మలయమారుతంబు । మలసె మించి.

వ. తత్సమయంబున,

గీ. ఘనజఘనతన్వి । స్తనభార వినమితాంగి
వికసితాంభోజపత్త్రాక్షి । విద్రుమోష్ఠి
యనుచు వాఁగోపిఁ దలఁచి రోమాంచమునను
కుందు వాసియించుఁ బ్రలపించు । సుందరుండు.

—♦ వృద్ధవేశ్య ♦—

ఉ. ప్రాయముఁ జెప్పనేల విధి। బాల్య మెఱింగిన వృద్ధవేశ్య నా
రాయణి, యర్థసంగ్రహణ। నారాయణి మన్మథమంత్రశాస్త్రపా
రాయణి యోర్తు తత్పురవ। రంబున రాజిలు వేశ్యవాటికన్
బాయక సంచరించు రతి। మల్లవరుల్ కడుఁ దల్లడిల్లఁగన్

గీ. జానుపర్యంత లంబిత। స్తనయుగాఢ్య
ద్వీపురుష భుజపరిగ్రాహ్య । విపులమధ్య
అతులభేరీనినాదస్మి। తావృతాస్య
విటజనేభ పంచాస్య యా। వృద్ధవేశ్య.

సీ. విటులఁ జూచినవేళ । వెలిపుచ్చు దరహాస
మమవసచీఁకటి । ననుకరింపఁ
జేటు తెల్లంబుగఁ । దెల్లబాఱిన బుఱ్ఱ
ముగ్గుఁబోసిన బుట్ట । పోలుపుఁ దెలుప
లొట్టకన్నుల తల। కట్టు నాకన్బొమల్
గొంగళి పురుగుల । రంగు లీన
వెన్ను వంగిచలింప । వ్రేలాడు చన్నుల
నుయ్యాల లని బాలు । రుల్లసింప



గీ. నవ్ములకు మంచి యిమ్మగు । తమ్మలంబు
లొత్తపోయిన బుగ్గలో । నత్తమిల్ల
హేమసుందరు వీక్షింప । నేగుదెంచె
విటజనేభ పంచాస్య యా। వృద్ధవేశ్య.

సీ. "అత్త యెచ్చటి కిప్పు । డరుదెంచు చుంటివి
పలుకవా" యని విటుల్ । పలుకరింప
"ధన మిచ్చినం గాని । తలుపుదీయ" దటంచు
ధనహీనవిటులు కొం। దఱు వచింపఁ
"గామింపఁ దగిన యా। కామాక్షికిం దల్లి
యీవృద్ధ" యని కొంద । ఱెవగింపఁ
"గొత్తయల్లుని కొఱ । కత్త వచ్చుచు నున్న
దైయుండు" నని కొంద । ఱవహసింప

గీ. "నింతులకుఁ గాంతులకు మందు । లిచ్చు" ననుచు
బా కూ టిల్లాండ్రు కొందఱు । ప్రస్తుతింప
నేరి కేరీతిఁ బలుక కా। వృద్ధవేశ్య
హేమసుందరుగృహమున । కేగుదెంచె.

ఉ. ఇంచుకయైన జంకక య। నేకజనంబులఁ జంపి యాఱఁ బా
ర్జించినవిత్తముఁ గృహము। క్షేత్రముల న్మణిభూషణంబుల
న్గాంచి హరింపఁగా నిమువ। గజ్జెలతల్లికి మాఱటన్ బ్రవే
శించె గృహంబునన్ సిరిన। శింపక యుండు నెయొక్కప్రేమ్మెడిన్.

సీ. నాడిఁ బరీక్షించి । నయనంబు లెత్తి పై
త్యాధికంబుగ నున్న । దనెడువాని
క్షీణించె ధాతువు । శీఘ్రంబుగా స్వర్ణ
భస్మంబుఁ గొండని । పలుకువాని
నకలంక మగుమందు । మకరధ్వజం బని
యత్యధికంబుగ । నమ్మువాని
సుఖసంకటములకు । శుష్కించె మీమేను
మేలుకొం డని చెప్పు । మేలువాని
గీ. మదనకామేశ్వరీలేహ్య । మహిమవలన
సురతమింపొందునని సొక్కు । సోలువాని
బ్రదుకఁ డాతఁడు పొండని । వదరువాని
హేమసుందరు వీక్షించె । వృద్ధవేశ్య.

వ. తత్సమయంబున వేఱొక్కరుండు వచ్చి హేమసుందరుం జూచి యిట్లనియె.

ఉ. అక్కట! నిన్నముగ్రితరుణార్కమొసంగితినంచు రూకలన్
గ్రక్కునసంగ్రహించితిఁ । గాలములో గుణమిచ్చునంచు మీ
రక్కడనుండి వే వెడలి । నంతన యేమనవచ్చు...రోగియిం
కెక్కడఁ? దిక్కులేని ధన । హీనుల నివ్విధి మోసపుత్తురే.

గీ. ఉన్నరోగంబుస్వల్ప మ । త్యున్నతముగఁ
జేసి వేగబాగా నని । యాసవెట్టి



రకట తుదకు నిట్లయ్యె మీ । హస్తములను
ఘల్లుమనినంత వారింట । ఘొల్లుమనిరి.

గీ. అనిన విని వాని కున్న తా । ననమొసంగి
"యొసఁగఁదగు నౌషధం బాయు । వొసఁగఁగలమె?"
యనివచించి భస్మాదిలే । హ్యముల నొసఁగె
హేమసుందరు నైపుణ్య । మెన్నఁదరమె.

వ. ఇట్లెల్లరఁ బ్రియవాక్యములం దనిపి వీడ్కొల్పి యనంతరము వృద్ధవేశ్యం జూచి మందస్మితమండితముఖమండలుండై నీవు వచ్చినకార్యం బేమనిన నామె సవినయంబున మృదుమధురవాగమృతంబు వర్షించుచు నిట్లనియె.

—♦ వసంతోత్సవాహ్వానము ♦—

ఉ. కమ్మనికుందనంబనఁగ । గ్రాలెడుచక్కఁదనంబుఁగల్గిలో
కమ్మునవైద్యరాజులన । గా నుతికెక్కిన మిమ్ముఁజూచుభా
గ్యమ్ములభింపకుండెనిపు । డయ్యది చేకురెనంచు నెంతయున్
నెమ్మదినంతసించెద గ । ణించెద మీసహవాససౌఖ్యమున్.

ఉ. అక్షయమైనసంపదయు । నంతకు హెచ్చినవిద్యయున్ సతీ
లక్షితచారుగుణవి । లాసములన్ గల యెమ్మెకాండ్రక
ధ్యక్షుఁడు సుందరుండు ఘను । డంచుఁ గడుంగడు నాకుమారికా
మాక్షి వచించుచుండు నపు । డప్పుడు నే విని సంతసించెదన్.

గీ. ఋతువులకునెల్ల సామంత । మీవసంత
ముత్సవశ్రేష్ఠమగు వసం । తోత్సవంబు

జరుపనున్నారు నేఁడు మా జాతివారు
తమరు సరసులు రాఁదగు సమయ మిదియ.

వ. అనిన విని హేమసుందరుం డట్లయగుఁగాక యని యామె వీడ్కొలిపి యిట్లని వితర్కించె.

ఉ. వంతలపాలొనర్చి, నను బాసిన యాలలితాంగి నెంచి నే
నెంతయుఁగుందుచుండఁ దన యింటికి రమ్మని వృద్ధవేశ్య వా
సంతమహోత్సవంబను మిషన్ ననుఁగోరినయంత నారనా
స్వాంతము చల్లనయ్యెఁ గనులారఁగఁ జూచెదఁ గామిఁ గామినై.

గీ. విటులు కామించి తుదకు నీప్సితము చెడిన
వెఱ్ఱులై మాఱుపేరులఁ బిలుచుచుందు
రంతమాత్రాన నేమయ్యె నఖిలజనులఁ
గామియనుపేరఁ గామాక్షి ఘనతఁ గాంచె.

—♦ సంకల్పము ♦—

ఉ. చక్కనిచుక్కయంచు సరసంబులెఱింగినజాణయంచు నా
జక్కవదోయిసొంపునకు సక్కెములాడుచు చన్నుదోయిఁ బెం
పెక్కినచానయంచు విటు లెల్లఱుఁ గామినిఁ గామి నెంచి న
ల్దిక్కులఁ జాటుచుందురు గదే జగదేకమనోహరాంగిఁగా.

చ. వలచితి ముద్దులిచ్చి బహు భంగుల నక్కున గారవించి కో
ర్కెలఁ దుదిముట్టఁ దీర్చి యలరించితి నింటికిఁ బెద్దఁ జేసితిన్
గులసతి రోసితిన్ గడకుఁ గొంపము నింగినయట్టు లిన్నియున్
దలఁపక కాళ్ళఁ దన్నుకొని తప్పిచరించునె గోపి యక్కటా.



ఉ. ఇక్షుశరాసనవ్యథ సహించి మనంబును నిగ్రహింపఁగా
దక్షుఁడవందు? గోపితల దన్నులతాంగి లభింపకున్న నా
యక్షయమైన కల్మి కదిరా మదిరాక్షి సరోరుహాక్షి కా
మాక్షి లభించె నాదు కలవంతయుఁ దీరె విచారమేటికిన్.

ఉ. చిన్నదియందకత్తె యని చెప్పుదు రింతకు నామె తల్లి ర
మ్మన్నది సంశయింపఁదగునా మగవానికి? నాకులోవ మే
మున్నది? తృప్తిదీర ధన మున్నది, యాపయిఁ బ్రాయమున్నదే
మున్నది చచ్చునంతఁ దను వుండునె యీ మను వుండునే భువిన్.

గీ. ఆడఁబోవుతీర్థం బెదురైనయట్లు
వెదకఁబోవుతీగియ కాళ్ళ బెనఁగినట్లు
తెలమి గామాక్షి వీక్షింపఁదలఁచినంత
నింటి కేతెంచి పిల్చె నీ వృద్ధవేశ్య.

ఉ. కోపముఁ జెందుఁగాక జనకుండు కులాంగన కుందుఁగాక యా
క్షేపకులైన మూఢు లుడికింతురుగాక కులంబు గీన్ హాస్య
స్త్రావముఁ జెంది ఛీయని దిసంతులు కొట్టినఁ గొట్టుఁగాక; నే
నీపయి విత్తమిచ్చి భరియించెదఁ గామిని మందగామినిన్.

చ. సరసత లేక దేహమున శక్తి రవంతయు లేక కామినీ
సురతసుఖంబులన్ బడయుచొప్పనెఱుంగక జాణలైన సు
దరుల వరించి యేలుకొను ధైర్యము లేక వచింతురక్కటా
పరసతిఁ జూడరాదనుచు వారు నపుంసకులంచు నెంచెదన్.

ఉ. సంపదఁ బ్రాయమున్మతియు । జక్కదనంబుఁ గలట్టివాఁడ గా
మింపఁగరాదె? వేశ్యలర । మింపఁగరాదె? సుఖింపరాదె? నా
పెంపుసహింపలేని యవి । వేకులు లోకులు వీరికేమి? లో
గొంటమునింగినట్లు కడుఁ । గుందెదరన్యులసౌఖ్యవృత్తికిన్.

శా. ఈలోకంబునసౌఖ్యమొందవలెఁ గా । కీజన్మమింకేల వే
శ్యాలోలుండని లోకులందురని నే । శంకింతునే? వృద్ధవే
శ్యాలాపంబుల వీనులారవిని నే । నాశించితిన్; వేగమా
బాలారత్నముతో రమింపవలదా । వైద్యోపదేశంబునన్.

వ. ఇట్లు వితర్కించి వసంతోత్సవంబు సందర్శింపనిశ్చయించి ధౌతవస్త్రముల నలంకరించుకొని గృహంబుఁ బాసి శీఘ్రగమనంబున.

— వేశ్యవాటిక —

చ. చనిచని చూచె సుందరుఁడు । సజ్జనదూషితదంభవాటికన్
వనరుహపత్రివిఘటిత । పంజరబద్ధసుమాత్ర ఘోటికన్
వినయవిలాసవేషయుత । విత్తవధూకులరత్నపేటికన్
జనఘన తేహిత త్తహిత । నాట్యకళాంకిత వేశ్యవాటికన్.

వ. ఇట్లు వేశ్యవాటికంజూచి యందుఁ బ్రవేశించి,

సీ. తనుజూచి మెలమి లేఁ । చినయట్లు నటియించి
యించుకపృథుపృష్ఠ । మెత్తుదానిఁ
దనుగాంచినంత జా । ర్చినపైట సవరించు
వడువునఁ జనులఁ గే । లిడినదానిఁ



దనమోము వీక్షించి । నెనరున్నరావచ్చు
ననునట్లు లోనికి । నరుగుదానిఁ
దనతోన నించుక । చనవున్నచందాన
దరహాసముం జేసి । మురియుదాని

గీ. సుందరుండు వీక్షించి యా । నందమొంది
నాదిగాక జన్మం బని । నవ్వుకొనుచు
మీసములఁ ద్రిప్పుకొనుచు వి । లాసగతులఁ
జనియె నావసంతోత్సవ । స్థానమునకు

సీ. ధన్వంతరియెవచ్చె । దర్శింపుఁ డనియోర్తె
వాలుఁ జూపులఁ జూచి । వానిఁ దెలుప
రతియేడనున్నది । రతినాయకుఁడు వచ్చె
మేలుకొండనియోర్తె । మేలమాడ
నాలోకదేవేంద్రుఁ । డీలోకమున కిప్పు
డేతెంచె ననియోర్తె । యింపునింప
నలరంభ నెడబాసి । నలకూబరుఁడు వచ్చె
నాశ్చర్యమనియోర్తె । నిశ్చయింప

గీ. నెన్నఁడును రాని వారిపు । డేగుదెంచి
రనుచునోర్తుక సురభిచం । దనమొసంగ
వచ్చిరని వృద్ధవేశ్యయుఁ । బలుకరింప
నతఁడు కూర్చుండె నాసభా । భ్యంతరమున.

చ. జరగె మహోత్సవంబు నర।నపురిఁ బుతాప్రతిమానగానసు
స్వరనటనానుకూలవర। వారవధూపదనూపురారవ
స్ఫురితవిటప్రవర్షితవ। సుగ్రహణాగత చేటికాజనో
చ్చరితమహాప్రసాదజయ।శబ్దవిమోహిత నాకలోకమై.

—♦ వసంతోత్సవము. ♦—

వ. తత్సమయంబునఁ గామాక్షి తన నైపుణ్యముం జూపుతలంపున నాట్యరంగపురోభాగంబున కేతెంచి,

ఉ. కంగులుదీర్చినట్టి అవి।కన్ జనుఁదోయి యణంగకుండ ను
ప్పొంగినయట్లు కల్చి జిగి। మోవిని చిన్నగవం కురింపమా
ర్దంగికుఁ జేరి యాతనిమృ।దంగము పైఁ గరమూని వాలుఁజూ
పుంగవపొంతనుండు విట।పుంగవులం గరఁగింపఁ జూచుచున్.

సీ. తళతళ త్తళలీను। జలతారు గాగర
పసిడినిగ్గుల సొంపు। భ్రాంతిఁ గోలుప
నెత్తమ్మిపూవులఁ గ్రొత్తయుత్తరుతావి
మెయినుండి దిక్కుల। మేలుకొలుప
అవికబిగింపున। ఆపాదకేపారు
చనుదోయి పైటలో। గునిసియాడ
విడనాడ కేనాఁడు। వెన్నాడి వ్రేలాడు
కీలుజడం గ్రాలు। పూలు రాల

గీ. ఘల్లుమని గజ్జెలందెల। గర్వమణఁచి
తాళమానంబులం గూడి। ధ్వనులు నీనఁ



బాటకనుకూలముగనుండు। నాటలాడి
కపటవినయాభినయముల। గరిమఁ జూపె.

గీ. భళీభళీ బాగు బాగు వహ్వాయటంచు
చాలురా మేలు మేలురా। జాణయనుచు
నౌర యయ్యారె యొయ్యారి। యానటంచు
సభ్యులెల్లఁ బొగడిరి। సంతసమున.

శా. గానప్రక్రియ కానుకూల్యమగు నా।కంఠంబు, విన్నాణమౌ
నానాట్యంబు మనోజ్ఞమౌ నభినయం। బా తాళ మా మేళ మ
త్యానందంబు ఘటింపమై మదిని మో।హాంభోధి నీఁదుచున్
మానంబూనెను హేమసుందరుఁడు బ్రా।హ్మంబోలిని శ్చేష్టుఁడై.

సీ. పెండ్లాడ నని యింట। బీరంబులాడిన
వాఁ డామెనపుడ పెండ్లాడ నెంచె
భార్యఁ బాయని యేక।పత్నీవ్రతుం డొక్కఁ
డాజాణమైత్రిని। నభినుతించె
సన్యసింపఁదలంచు। జనుఁ డొక్కఁడామెతోఁ
బెంపొంది పైసన్య।సింప నెంచె
ధనమేటికింక యీ।తనువేటికీమోఁ గూ
డదనంచు యొకలోభి। యొదఁదలంచె

గీ. విత్తహీనుండ ననికుందె। విటుఁడొకండు
జవ్వనమణంగెనని యేడ్చె। నరసుఁడొకఁడు

సమయమూహించె భాషింప । జాణఁడో కేఁడు
డెందమేమయ్యెనొ యుఁగఁ డా।సుందరుండు.

చ. అలరులఁ దేనె లూరినటు । లాధనకామిని పాడినట్టి పా
టలవిని పాడినప్పుడు త।డంబడకుండఁగ నాడినట్టి యా
టలఁగని యొక్క జూదరి, మొ।దండఁగ దుంగడు మెచ్చె నేఁడు నే
గెలిచిన విత్తమిచ్చెద సు।ఖించెద నంచు విమోహితాత్ముఁడై.

మ. తనపిత్రార్జితవిత్తమున్ సరసుఁడై । ధ్వంసంబుఁ గావించి, ని
ర్ధనియై వేశ్యలపొందికన్ దలఁచుచున్ । రంజిల్లు దేవాంగుఁడా
ధనకాంతామణియాటపాటల కడం।దన్ మెచ్చి చింతించె, స్త్రీ
జననం బేటికిఁ బేదనై తిననుచున్ । సంభోగవాంఛామతిన్.

చం. పసచెడి పేదయైన యొక । వైశ్యవరుం డపుడామెఁ జూచి సం
తసమున మెచ్చె నౌర! తల।తప్పగదా యిపుడేమియున్న దీ
రొసపరి సానినే బ్రదికి। యుండిన యప్పుడు చిక్కియున్న నా
మనకమె సంగఁ గూడికల। మాన్య మొసంగ నెయంచు సమ్మదిన్.

వ. అత్తరి నా హేమసుందరుండును వ్యామోహితాత్ముండై
యపు[illegible]దంబు డెందంబునం గ్రిందుకొన నమ్మంద
యానం జూచి,

మ. భళి రాయియ్యది నాట్యరంగమొకొ నవ। స్వర్గంబయాగ కయీ
యలరుంబోణియమర్త్యకాంతయగునే। యారంభయాగాక కో
యిలరొక్కించుకకూయుఁగాక గలదే। యీపాటయీయాట; నే
గలిమింగాంచినదానికి న్ఫలముగా। గామాక్షిఁ గామించెదన్.



వ. అని యిట్లు తలం దూహించి, యమ్మహోత్సవానంతరమునఁ
గామాక్షి నివసించు గృహంబున కేగినంత, లోనుండి
యావృద్ధవేశ్య వీక్షించి, తనకుమారిం బిల్చి,

ఉ. ఎన్నఁడు రానియీసరసు। లిప్పుడు వచ్చిరి, రూపుఁ దాల్చి సం
పన్నిధి వచ్చె; నీగృహము । పావనమయ్యెనుచూడ వేమి నీ
కన్నుల పండువయ్యెనని । కమ్రవచోవిభవాభిరామమై
మున్నదు రేగి రండుగృహ।ముం గనుఁ డంచును దెచ్చెలోనికిన్.

ఉ. రండని యాదరించి పలు । రంగులఁ గ్రాలెడు పీఠమందుఁ గూ
ర్చుండగ నిచ్చి, పైవినయ । ముట్టిపడన్ దమ రీపురంబునం
దుండియు మానివేశమెటు। లుండునొ చూడరు వైద్యవిద్యలో
బండినవారు, ఖ్యాతిఁగల । పండితులీమది లంజెఁ జూతురే.

చం. అనవుడు సుందరుండుదర। హాసము మీసములో రహింప ని
ట్లనియెను; రాకయుండఁగల। నా? యపుడప్పుడు రాఁదలంచుచుం
దును సమయంబు చిక్కదు; జ।నుల్ నను బాయక యౌషధంబుల
న్గొనిచనుచుందు రెట్టులొన। గూడును కాలము ముమ్ముఁ జూడగన్.

చం. పురిఁగల పేదసాదలను । బ్రోచుటకై మనయూరిరాజుగా
రిరువది వేలరూప్యముల । నిచ్చిరి మందుల కంచు నందుచేఁ
బరులనుజూడఁగన్ గృహముఁ। బాయఁగఁ గాలము చిక్కకుండెనె
ప్పురసున నైన రాఁదలఁచి। వచ్చితి మీసభఁ జూచి మెచ్చితిన్.

— సుందరుని వికత్థనము. —

సీ. వైద్యుల మెప్పించి వైద్యనాథఖ్యాతిఁ
దేజరిల్లితి వంగదేశమునను
వరపండితులమించి వాదించి యోడించి
దీపించితిని యోఢ్రదేశమునను
ధన్వంతరియనంగ నన్వర్థమగునట్లు
తార్కాణముగనుంటి దక్షిణమున
వైద్యరాజఖ్యాతి బహుమానములఁ బొంది
సంచరించితి రాజసభలయందు
గీ. దృష్టిదీక్షంగ విత్తమార్జించినాఁడ
వేలకొలఁదిగ వెచ్చింపఁ జాలినాఁడ
వైద్యులకు సద్యశంబు శాశ్వతధనంబు
దానికిఁ గళంకమొదవిన హానివచ్చు.
గీ. వైద్యులకు జారవృత్తి స్వభావ మగుట
నించుకంతలోపంబు వీక్షించిరేని
కింవదంతులఁ బుట్టించి కేరుచుందు రీ
లోకులను నమ్మవచ్చునే కాకులరయ.

పరదూషణము.

గీ. అనుపూర్వ్యగ రాజవైద్యవరులనఁగ
ఘనతకెక్కిన వారింట జననమొంది



యుంట నధికవిఖ్యాతితో నొప్పుచుండె
జారుఁడయ్యును మాధవాచారియొకఁడు.
ఉ. జారుఁడు దుష్టవర్తనుఁడు సజ్జనదూషితుఁడైన మాధవా
చారి కళింగభూపతిభిషఙ్మణి యన్ బిరుదంబు నిప్పురిన్
బౌరులు గౌరవించెదరు వైద్యమెఱుంగఁ డతింగినట్లు సం
చారముఁ జేయుచుండు జనసమ్మతి మొందిన కారణంబునన్
ఉ. ఆతనివృత్తి వేశ్యలగృహంబులయం దభివృద్ధిఁ గాంచె; వా
క్చాతురిఁ జూపు; నౌషధమునం గఁ జేవయు లేదు దంభవి
ఖ్యాతినిఁ బట్టి వైద్యవరుఁడంచు నుతింతురు పౌరు లింతకున్
హేతువు వేషధారియతఁ డెన్నఁడుఁ జూడఁడు వైద్యశాస్త్రమున్.
ఉ. పేదలనుండి విత్తము లభింపక యుండుట యట్టులుండె; నే
మాదిరి వారలైన నొకమా రతనింగని పిల్చినంతనే
యేదియొ యిచ్చివచ్చు ధనమేమియుఁ గోరఁడు వైద్యరాజమ
ర్యాద నశించె నీపురమునందున నాతని కారణంబునన్.
గీ. అందుచేఁ జూవె నే నపఖ్యాతియనిన
నధికముగ భీతిఁ బొంది గృహంబుఁ బాయ
ననుచు శ్రీరంగసీతుల నాడుచుండ
వానివీక్షించి యావృద్ధ పలికెనిట్లు.
శా. మీ రేలిట్లు విచారమొందినమదిన్ మేమిట్లు దుఃఖింతుమో
వారస్త్రీలిపుడెందతెందఱని నేఁ భాషింతు లెక్కింతు కిసం

సారస్త్రీలని వారకాంతలనియున్ । శక్యంబె భేదింప? నిం
కేరీతిన్ బ్రదుకంగవచ్చు నకటా । యేమందునీ కాలమున్.

—। జారస్త్రీ దూషణము ।—

సీ. విటులనువంచించి । పెద్దమేడంగట్టి
నడ్డుమీఱి చరించు । నొడ్డెముండ
మన్నింపఁదగినట్లు । మన్నెంబులార్జించె
బహువేషములఁదాల్చి । బలిజలంజె
ఈడిగిలంజను । వేడుకకాండ్రకు
పగలాడియయ్యె నీఁడిగలమగువ
అది యదృష్టంబెమో । యందఱిలఁదన్నె
నిపుణ దూదేకుల । యెమ్మెలాడి

గీ. నాగరత్నాది నూతన । నామములను
బెట్టుకొని వీరలిప్పుడు । పెద్దలైరి
సానులావీరు మాకు సై । తానులైరి
సంకరంబయ్యె మాజాతి । స్వచ్ఛమయ్యె.

చం. వెడఁగులఁజూచి వీరువల । పించెదరయ్యది యట్టులుండ నె
న్నఁడు వినమిట్టి వింతఁదమ । నాథుల కన్నులదుమ్ముఁగొట్టి వా
వడపుఁబడంతులేడ్చుటకు । బాఁపనసానులు లేచిరింక మా
కడుపులు నిండవచ్చునె జ । గన్నుతకీర్తి ఘృణీభిమజ్జణీ.

సీ. కోమటిజగ్గయ్యఁ । గొంపమ్మకొనునట్లు,
జోగిఁగావించెనే । యోగిభామ



మగవాండ్రకియ్యది । తగునె భర్తంబాసి
స్వైరిణియయ్యె వ్యా । పారినారి
రానివానిదెసప్పు । రతులను మెప్పింపఁ
జాలినజాణ వైష్ణవ వధూటి
వాలుఁజూపులఁజూచి । వలపించుఁ గుసుమాస్త్ర
ఘోటిఁబోలిన వెల । నాఁటిజోటి

గీ. అతులబలులను పదిమంది । నైననోర్చు
సాటిలేనట్టి కాసల । నాఁటిబోఁటి
విటులగర్వం బణంచు ద్రా । విడులపడుచు
సాను లమితతుష్టావ్యథా । గ్లానులైరి.

మ. తొలుతన్దానొకలంజయై విటులసొ । త్తున్దోఁచుటట్లుండఁగూఁ
తులనల్లుండ్రను జేరనీయక జనుల్ । దూషింపఁగా నక్కటా
కులటావృత్తికి హెచ్చరించి ధనముం । గొల్లాడు నేవేళ మా
యలమర్మంబులఁబన్నుచుండుఁదగునే । యీవీధియమ్మన్నకున్.

గీ. బాఁపనమ్మలు కొంద ఱీ । పట్టణమునఁ
బగలు సంసారిణులఁబోలి । పలుకుచుండ్రి
సానులంబోలి రాత్రిల । సంచరింతు
రేమనఁగవచ్చు మాయోగ । మిట్టులుండె?

సీ. పగలుముసుఁగూని । వరవితంతువుమీఱుఁ
గామినియై రాత్రి । గణెముఁగోరుఁ

బగలు శుద్ధవిభూతి । ఫాలంబునందీర్చు
రాతిరి ఘనసార । భూతిఁ బేర్చుఁ
బగలు రుద్రాక్షంబు । లగణితంబుగఁ దాల్చు
వలపూర రాత్రి స్ర । క్కులనుఁ బొల్చుఁ
బగలు చక్కనిజరీ । బట్టలం గడుఁదిట్టు
రాతిరి నట్టివ । స్త్రములఁ గట్టుఁ

గీ. బగలు జారిణులం జూచి । పరిహసించు
సరససల్లాపముల రాత్రి । సంచరించు
విటులవంచించు నీరీతి । విధవ యొర్తు
ఎల్లిదంబయ్యె మావృత్తి । యెట్టు లోర్తు.

గీ. ఎండకేయెండ నెన్నఁడు । నెఱుఁగనట్టి
సతులఁ గూడ నంతఃపుర । సౌధములకు
విటులు స్త్రీవేషధారులై । వెడలుచుండ్రి
మాకు వ్యతిరేకముగ నుండు । మన్మథుండు.

వ. అని విని యక్కపట వైద్యుండు,

చ. సరిసరి చెప్పకేమి వ్యభి । చారగుణం బిల నన్నిజాతులం
దిరవుగ నాటుకొన్నయది । యెవ్వరెఱుంగరు దానికేమి నీ
వరసుత నేలు ప్రాపకుఁ డ । వండని నంతన సొంపునింపుచున్
చరితయనంగఁ గామివిని । గ్రుక్కన నాదలవంచె నత్తఱిన్.

వ. వృద్ధవేశ్య యిట్లనియె.



గీ. వినుఁడు మీనాక్షి కామాక్షి । యనెడు కూఁతు
లిరువురున్నారు చిన్నది । యీలతాంగి
అకట! మీనాక్షి పెద్దది । యామెయిపుడు
కందువాతెఱ లూతారోగ । కారణమున

గీ. నీతియున్ ఖ్యాతియున్ లేని । జాతులందు
నరయ మాజాతి యతిహీన । మయ్యె నకట
ధనము ముఖ్యంబుగా నెంచు । వనిత కింక
ప్రాపకుల కేమిలోపంబు । వైద్యరాజ.

ఉ. మన్నములన్ సువర్ణబహు । మానములన్ రతనాల పేరులన్
గ్రిన్నన నెన్నియైన నొక । రాత్రికిఁ బాటకు నొక్కమాటకున్
కన్నకు నిత్తుమంచు విట । కాండ్రు వచించుచుఁ బోవుచుందురీ
కన్నులఁ జన్నులన్ గరయు । గంబున ముట్టి వచింతు నొట్టుగా.

మ. ధనమా! పావనమింతకున్ దగిన వి । ద్వద్వంద్య నేగానియ
న్యుని వీక్షింపను మాటలాడ ననుచున్ । గ్గూర్చుండెఁ గామాక్షి యా
నని కానిమ్మని మిన్నకుంటి నెవఁడ । య్యా యట్టివాఁ డొక్కనిం
గననా నేఁ మిముఁబోలువారు గలరే । తొమ్మండలిం జెప్పుఁడీ

సీ. అనవద్యహృద్యగ । ద్యాది పద్యాన్విత
భవ్యకావ్యంబులం । బలుకఁగలదు
గంతుఁగోయిలమురాళి । దండెత్తి నట్టుల
సరససంగీతంబు । జరుపఁగలదు

కలవాణి యగువాణి । వలపించుచందాన
నింపుగా వీణవా।యింపఁగలదు
పాణి మున్నట్టుల । రంగులసొంపు ర
హింపఁజిత్రములఁ జి।త్రింపఁగలదు

గీ. లాస్యమున నీమెఁ బోలు చం।ద్రాస్య లేదు
మీరు వీక్షింపలేదె క।న్నార నేను?
చెప్పుటకు సిగ్గుగానుండు । సృష్టియందు
సుదతిఁ బోలింపఁగా సర।సుండు లేడు.

వ. అని వచియించి, కామాక్షిం జూచి, మఱియు నావృద్ధ వేశ్య యిట్లనియె.

ఉ. గోలవుగాక నీవు వెల।కోమలి వే? నెఱజాణ వౌదువే?
చాలును చాలు మెచ్చఁదగు।సాని వెఁకమ్మని కప్పురంపుఁదాం
బూల మొసంగవేమి? చనవుం గొని యించుక కుల్కవేమి? నీ
లీలలఁ జూచి వారలు బ।లేయని మెత్తురె? చిత్తమిత్తురే.

వ. అనిన విని యక్కామాక్షి.

చ. వలపిగురొత్తసుందరుని। వాలికచూపులఁ జూచి యేమియుం
బలుకక వక్కలన్ సురభి।వస్తుచయంబును సంగ్రహించి లో
నలరుచు నుండి పళ్ళెరము।నం దిడి పైఁ దెలనాకు లేర్చుచున్
జిలుకలఁ జుట్టుచుండె దన। నేరుపుఁ గూరుపు విస్తరిల్లఁగన్.

వ. అట్లు చిలుకలం జుట్టుచు నానెఱజాణ,



ఉ. సొత్తుహరింపగా సొగసు।జూపుల రెప్పల నప్పళించుచున్
జిత్తము పల్లవింప విట।శేఖరు మెల్లగఁ జూచి నవ్వు; న
న్మత్తత మోవి నొక్కఁ బలుఁ। నాటగ విత్తము సంగినంత మో
మొత్తెదు లంజె కిన్నివగ।లేటికి? మూఢుఁడెఱుఁగఁ జాలునే.

వ. తత్సమయంబున హేమసుందరుండు వృద్ధవేశ్య కిట్లనియె.

చ. స్థిరముగ నొక్కవాక్యము వ।చించెద మాసము నిండినంత నే
యిరువదియైదురూప్యముల।నిచ్చెద; నావయి నప్పుడప్పు డా
భరణము లిచ్చువాఁడఁ గఱ।వా తెఱవా గల యా స్త్రియంతయున్
గరమనురక్తి నిత్తు ననుఁ।గాదని యన్యునిఁ జేరకుండినన్.

వ. అనిన విని వృద్ధవేశ్య యిట్లనియె; 3707

ఉ. పొచ్చము లేక మీ వలపు।పొల్లగునే? దయ నేలుకొందు మీ
మెచ్చులకున్న దేవిలువ । మీకును మాకును భేరమున్నదే?
ఇచ్చకు వచ్చునేని ధన।మిత్తురు భూముల నిత్తు రింతకే
మిచ్చిన నిచ్చువారె తమ।యెన్నిక కెక్కిన ప్రాణకాంతలున్.

సీ. పదివేలు రాబడి।వచ్చు మాన్యము లిచ్చె
సరసీరుహాక్షికి । శంకరుండు
ఒడలు నిండఁ బసిండి।తొడవుల నిడలేదె
జీవరత్నమునకుఁ । జిన్నసెట్టి
ఒక్కరాత్రికిఁ గాదె । యొక్కగ్రామం బిచ్చె
మధురవాణికి నాఁడు । మాధవుండు



మిన్నందుకొనుగొప్ప। మేడఁగట్టింపఁడే
కృష్ణవేణికి జెమ్మి। కృష్ణమూర్తి

గీ. వలపులిగురొత్త ముద్దుల। వలపుకాండ్రు
ప్రాణకాంతల కేమియు। రాదు చెపుడి?
మెచ్చులిచ్చి యేమిచ్చిన। నిచ్చువారె
వలపులకు వేడుకలకింక। విలువగలదె.

చ. అరువదియేండ్లపైఁబడియె। నాతకుడుందఱిచూచుచుండు; నే
నిరువదియేండ్లదాననయి। యెపుగనుందునె? కల్మియేటికి
సరసిజనేత్రమీకిపుడు। సంగతినెవ్విధి నేలుకొందురో [రుల్.
యెఱుఁగరె వైద్యనాథులుప। రేంగితముఙ్గ్రహించు నేర్ప

ఉ. మీవయయున్నఁజాలు మని। మేషములోసురరాజ్యమబ్బనీ
పైదలి మీవదాజ్ఞములఁ। బాయకయుండినలోపమున్నె? నా
కేదిసుఖంపగాసమయ। మెక్కడనుండిలభించుఁ? గల్మిఁగొం
పోదునె? యక్కటా ముసలి। ముండను కాటికిఁగాళ్ళుచాచితిన్

ఉ. కోటిమొనర్చు మీసుగుణ। కోటి మెదిక్కని యాశ్రయించునీ
కోఁటియదృష్టమెట్టిదియొ। బుద్ధిగ్రహింపఁగనౌనె? యింతకున్
గూటికిగుడ్డకున్ మఱియుఁ। గొంపకు లోపముసంభవింప దే
నాఁటికి నిశ్చయంబు విట। నాయకధిక్కృతవిత్తనాయకా.

గీ. నికరమైన ముహూర్తంబు। నిశ్చయించి
కన్నెఱికము బాపి యీ। కన్నెమిన్న



నేలుకొందు దాని యదృష్ట। మెట్టులుండు
నట్లయగుఁగాక చింతింప। నన్యమగునె?.

వ. ఇట్లావృద్ధవేశ్య భాషించు నవసరంబున,

సీ. కెంపులరవలతో। సొంపారుకమ్మలు
చెక్కులకొకవింత। చెలువమొసఁగఁ
దాంబూలమునఁగొంత। డంబుమీఱినమోవి
మందహాసంబున। నందమొంద
నగలచే నగలచే। వలపించునెమ్మేన
వలిపంపుజలతారు। వలువగ్రాల
గబ్బిగుబ్బలయుబ్బు। నిబ్బరంబణఁచిన
పైఠిణీఱవికెపైఁ। బైటజార

గీ. బెళుకుకొనునజాళువా। తళుకు లొలుకఁ
గరయుగంబున వెండిప। ళ్ళెరముఁబూని
యందియలమ్రోఁత నింపొందు। మందగతిని
యల్లనల్లనఁదరిజేరి। యామిటారి

గీ. లేనిలజ్జ నటించుచు। లేనిభీతి
నగలఁజూపుచు నందిచ్చెఁ। బళ్ళెరంబు
నైదుకాసులఁ బడవైచి। యావిటుండు
వీడియంబును గైకొనెఁ। బెంపలర్ప.

వ. అట్లతండు వీడియంబుఁగైకొని వృద్ధవేశ్యంజూచి, నీవని
నట్లు తగినముహూర్తంబు నిశ్చయించెద; తన్ముహూర్త

వేళ నీకుమారిం గనకాభరణాలంకృతం జేసి నూటపది యారులం గానుకగా నొసంగెద, మిగిలిన మర్యాదలం గూర్చి నీకుం జెప్పఁగా నేటి కని లేచి నిలువ నావృద్ధవేశ్య యిట్లనియె.

శా. చేతోజాతుని ధిక్కరించు జిగితోఁ జెల్వొందు మీ మేను; మీ
కేతన్మాత్రులె? కామినేలఁగలవారి మాట యిట్లుండఁగా
లూతారోగనివారణార్థమయి యిల్లున్ గుల్లఁగావించితిన్
మీతోఁ జెప్పక తప్పనే యకట మా మీనాక్షిఁ గాపాడుఁడీ.

చ. అనవుడు సుందరుండు వివిధౌషధముల్ గల వెన్నియైననుం
గొనఁదగు నిట్టి రోగములఁ గోటికి హెచ్చుగ బాగు జేసితిన్
ధనికులు భూమినాయకులు నావర వైద్యము నెన్నుచుందు రే
ననయము వేయినూటపది యారులఁ గైకొను వైద్యనాథుడన్.

వ. అని వచించి హేమసుందరుండు తద్గృహంబుఁ బాసిచనియె అనంతర మా వేశ్యమాత కామాక్షిం జూచి యిట్లనియె.

చ. ఇదివఱ కెందఱెందఱిని యివ్విధి బూమెల మోసపుచ్చి నం
పదల హరించియుండము; ధ్రువం బని యాతఁడు విశ్వసించె నీ
వదనముఁ జూచి నీ నటన వైభవముం గని సాక్షి సోలితో
వదవదఁ జెందె మోహసముద్రగరిత; నేమన వచ్చుఁ గామునిన్

## — వృద్ధవేశ్య ప్రాగల్భములు. —

ఉ. చెప్పెద నొక్కమాట విటశేఖరులం గరఁగించు నేరుపుం
జొప్పు నెఱింగి తేనియలు జొబ్బిలు పల్కులఁ బల్కి విత్తముస్



గుప్పలుగాఁ గడింపవలె; గూరిమిఁ బేరిమిఁ జూపి యెమ్మెలన్
జప్పున వీనిలోఁ బఱది సంపదలన్ హరియింపఁగావలెన్.

గీ. తాళిగట్టినమగఁడఁటే తలిరుఁబోణి
వీనితలఁ దన్ను సరసులు వేనవేలు
ఇతనివిత్తమే పాటిదో మఱి నెఱింగి
పొగనంపుము వేగమే స్వస్తి జెప్పి.

చ ఒకనికి ముద్దులిచ్చి, మఱియొక్కనితో సరసంబులాడి, వే
ఱొకనిని కౌఁగిలించి, మఱియొక్కని రమ్మని కన్నుగీటి యిం
కొకనికి స్వస్తిఁ జెప్పి మఱియొక్కనితో రతికేళిఁ దేలి ప్రా
పకుని వరుండఁ బెట్టఁగల వారలతాంగికి లోపముండునే.

ఉ. ఆటవెలందికిం దగిన యందముఁ జందము లేక యుండినన్
బైటకు జార్చు నేర్పు, చనుబాతులఁ జూపియుఁ జూపనట్టి సం
య్యాటలు మందహాసపరిహాసములున్ నవ్వుఁబువ్వఁ దేనెబో
ల్మాటలుఁ జాలు మా పుటకు మందులు మాకులు వెక్కలేటికిన్.

ఉ. ఎమ్మెలు బూమెలుం గల యనేకములయ్యవి కానరాని మేల్
సొమ్ములు వారకాంతకుఁ బ్రసూనశరుండు లభింపఁ జేసె, నీ
వెమ్మెయి వీనివిత్తము గ్రహించి రహింపుము సాగనంపు మో
యమ్మరొ యౌవనంబు మనయాస్తి గనమ్ము మునెమ్మనంబునన్.

గీ. యౌవనం బున్నయప్పుడె యఖిలవిటుల
ప్రాపకముఁ బొంది యార్జింపవలయు ధనము

యౌవనము లేని జీవన । మౌవనంబు
గణిక యొకనిలోఁ జేయునే । కాపురంబు.

సీ. వాలుమీలం బోలు । వాలికచూపులఁ
గనినంత నొక్కండు । కడు రహించుఁ
బండు వెన్నెలనిండ । మెండుఁగ బకపక
నవ్వినంత నొకండు । ననుపుఁబొందు
ఝుణఝుణన్నూపుర । స్వనము లింపొందఁగఁ
దన్నినంత నొకండు । తపివిఁ జెందుఁ
దాంబూలరాగంబు । డంబారనవ్వుచు
నుమిసినంత నొకండు । బ్రిమసిపడును

గీ. సరసగోష్ఠికి నొక్కండు । సంతసించు
ముట్టినఁ బాడినఁ జేరి । మూరుకొనినఁ
గసరినఁ గౌఁగిలించిన । నెనఁగుచుండు
నొక్కఁ డొక్కఁడో చక్కని । చుక్కవింటె
భేదమున్నదె? విటులకు । విటపులకును.

సీ. సోమసుందరుఁ గోరి । కామించి ప్రేమించి
జోగిఁ గావించితి । సుందరాంగి
నాడు స్థానాచార్య । నాచాయకుం ద్రిప్పి
కొంపనమ్మించితిఁ । గోమలాంగి



విశ్వనాథుని మెచ్చి । విశ్వసింపఁగఁ జేసి
చేతి కిచ్చితిఁ జిప్పఁ । జిగురుబోణి
పద్మనాభున కంక । బాంధవంబును గూర్చి
యిల్లు గట్టించితి । నిందువదన

గీ. ఆవిలాసంబు లారంగు । లాహారంగు
లాసొబగు లాహంగులా । యాబెడంగు
లహహ యౌవన్నెలా చిన్నె । లనుపమాంగి
తలఁచుకొన్న నిప్పుడుఁ బుల । కలు జనించు.

వ. నాయనుభవం బెంతయని చెప్పం గలదాన, విటులు వచ్చు వేళయయ్యె భుజించి సిద్ధంబుగ నుండుమని యావృద్ధ వేశ్య కామాక్షితో లోనికరిగె అనంతరమున.

ఆశ్వాసాంతము.

మ. హరకోదండవిఖండనా! యతులశౌ । ర్యౌదార్యధీమండనా!
శరపుంఖాంకితకుండలా! నిజయశ । స్సంఛన్నభూమండలా!
వరభక్తాంబుజభాస్కరా! సురనుత । బ్రహ్మర్షిహృత్తస్కరా!
అరిభూనాయకలోకశిక్షక! యహ । ల్యాదేహసంరక్షకా!

మాలిని. మదవదరికులాంతా । క్ష్మాసుతాప్రాణకాంతా
కదనతలకృతాంతా । క్షత్రభూరుడ్వసంతా

పదగమితపవనాంతా । భక్తకేళీనిశాంతా
విదితసుగుణవంతా । విస్ఫురత్కీర్తికాంతా.

గద్య. ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్ష ప్రసా
దిత సత్కవితాలతా ప్రసూనాయమాన
నవీన ప్రబంధంబైన హేమసుంద
రోపాఖ్యాన గ్రంథంబునం
దు త్త రో దం త మ ను
ద్వితీయాశ్వాసము.



శ్రీరామచంద్రాయనమః
శుభమస్తు — అవిఘ్నమస్తు




# తృతీయాశ్వాసము.



కం. శ్రీమానినీకుచద్వయ
సీమా! కాశ్మీరపంక । చిహ్నితవక్షా!
కామాదివర్గశిక్షా!
భీమాహవకార్యదక్ష! । పృథివీరక్షా!

గీ. అవధరింపుము నీను నా । యాంకితముగ
నొప్పిదంబుగ నిప్పుడు । చెప్పఁబోవు
నవసుధారసమిళితసూ । నమకరంద
బిందుసందోహమైన న । వీనగాథ.

గీ. అఖిలపామరజన వంచ । నావగుణ ధు
రంధరుండగు నా హేమ । సుందరుండు

సత్వరంబ సువర్ణంబు । సంగ్రహించి
స్వర్ణకారున కిచ్చె నా।భరణవిధికి.

వ. అట్లతం డాభరణనిమిత్తము కొన్నిదినంబులంగడపి యొక నాఁ డేకాంతమునఁ గూర్చుండి నిజకార్యముంగూర్చి చింతించుచుండు నవసరంబున,

గీ. స్వస్తి; ధనసిద్ధిరస్తు, దీ।ర్ఘాయురస్తు
మంగళానిభవంతు తే । మానినీ వ
శీకరణతంత్రియనుచు నా।శీర్వదించి
వచ్చికూర్చుండె బ్రాహ్మణ।వరుఁ డొకండు.

వ. వచ్చినవానిఁ జూచి యాహేమసుందరుం డిట్లనియె;

గీ. ఇంతకాలంబు నను బాసి । చింతఁ దక్కి
దివ్యపుణ్యస్థలంబులఁ । దిరిగితిరిగి
వచ్చినాఁడవు నినుఁ జూచి । మెచ్చినాఁడ
మఱచితే నాదుస్నేహంబు । తెల్పు సురేంద్ర.

ఉ. అనవుడు వానిఁ జూచి హృద।యంబున నించుక సంతసించి, నీ
వెనరునఁ గాదె యార్యజన।నిశ్చితపుణ్యనదీనదంబులన్
ఘనులమహామునీంద్రుల జ।గన్నుతదేవతలన్ బురంబులన్
గనుఁగొనినాఁడ నీసహకా।రము నెమ్మది విస్మరింతునే?

గీ. సఖ్యమును విస్మరింపఁగ । శక్యమగునె?
అరయ సఖ్యంబునకు దూర । మనఁగఁ గలదె?



బర్హిమేఘంబులును, పద్మ।భాస్కరులును
కుముదచంద్రులుమనకు సా।క్షులుగనుండ్రి.

వ. అని యిట్లాభూసురుండు వచింప నౌనని తలయూచి యాహేమసుందరుం డిట్లనియె;

గీ. సరససంగీతసాహిత్య।గరిమఁ జూడ
సానులందును గలదు ని।శ్చయము సఖుఁడ
నీవు వీక్షింపవైతూర।లేవుగనక;
వరవసంతోత్సవం బొందు । జరగె నిచట.

గీ. నాఁడు కామాక్షి యను వార।సారసాక్షి
యాటపాటల నలరించె । నఖిలవిటుల
నావిలాసంబు లాహావ।భావములు
చూడవలెఁగాక చెప్పిన । సొగసు చెడదె.

గీ. అహహ కామాక్షి వదనశ।శాంకలక్ష్మి
అతులమణినూపురారావ।జితమరాళి
అధరనిర్జితబంధూక; । ప్రాణసఖుఁడ
యామెశరదాగమంబన । నతిశయిల్లు.

గీ. చక్కఁదన మిట్టిదని చెప్ప । శక్యమగునె?
అహహ! సౌందర్యలక్ష్మికి । నాలతాంగి
తిలకమగుఁగాక; యారతి।దేహమునకు
కాంచనాభరణం బగుఁ।గాక సఖుఁడ.

గీ. ఎలమినానాఁడు దానింటి । కేఁగియుంటేఁ
జెప్పవచ్చునే? నీతోడఁ । జెప్పకేమి?
వలచివలపించివిటులకుల । నలరఁజేసి
వలపు బంగరుబొమ్మ యా । యలరుఁగొమ్మ.

గీ. ఏగ్రహించితిఁ జూవె నీ । యింగితంబు
నే నెఱుంగనిసాను లెం । దైనఁగలరె?
వలపులేదనువిటులకు ధ్రువంబయగును
మోదుగుంబూవులకును రోఁపాలఁతులకును.

చం. రసికజనావతంస! మకరధ్వజశాస్త్రరహస్యవేదివే
యొసపరిలాడినిన్నుఁగని యువ్విళులూరక యూరకుండునిం
పెసఁగవచించువాఁడ నతిహీనసుఖానుభవ ప్రసక్తి; నేఁ
బసచెడిపేదనై తిఁగద । వారవధూపరిరంభకామినై.

— హితోపదేశము. —

గీ. వారవనితాపరిష్వంగవైభవంబు
స్వర్గమనియెంచి కామినై । సంచరించి
చిత్తమిగుకొత్త నకట వెచ్చించినాఁడ
నార్జితంబైన యమిత పిత్రార్జితంబు.

చ. తలఁచినయంత నేయమితతాపముఁగూర్చుచుచూచినంత నే
తొలమిని మోసపుచ్చి మతిహీనునిఁ జేయును తాకినంత నే
వలపులఁగుల్కి మోహమను వారిధిలోఁబడవైచు నక్కటా
కులటతపించుఁగాక కులకోమలిఁబోలునె? హేమసుందరా!



చం. వదరుదురొక్కవేళ, వలవంతకుఁజిక్కి కృశించినట్లు కుం
దుదురొక వేళ, నమ్మకముఁదోఁపఁ నటించుదురొక్కవేళ, న
వ్వుదురొక వేళ, లేనివలపుంబ్రకటించుదురొక్కవేళ, సం
పదలహరింప; భోగినులమాయ లెఱుంగఁ దరంబె యేరికిన్

గీ. వారకామినిమన్మథవహ్నికీల
కపటరూపేంధనంబునఁ । గ్రాలుచుండు
విటులు యౌవనధనముల । వేల్చి వేల్చి
తుదకు జీవచ్ఛవంబులై । బ్రదుకుచుంద్రు.

గీ. విటులు సంతతం బుమిసెడు । పీకిగాను
హీనకాముకమృగముల । కినుపబోను
వలపుకాండ్రను వంచించు । వలపుచేను
హానిగలిగించునై తాను । సానిమేను.

గీ. మేలుకాండ్రను వంచించి । యేలుకీలు
భూరిసుఖసంకటంబులు । పుట్టుపోర్లు
కమ్మవిల్తుచాడోలు, పెద్దమ్మవాలు
ఔర! వెలయాలుతో లూఁడి । నట్టడోలు.

ఉ. చిక్కనపాలుగారు నునుఁజెక్కులు గా వవి నత్తగుల్ల లే
పెక్కనగబ్బిగుబ్బలవి యేసారకాయలు గాక, సొంపు మెం
పెక్కనకావిమోవి యగునే యది యెంగిలిబావి గాక, ఛీ
పొక్కిలిక్రిందినుండు నొక ప్రోఁకె? మొక్కలిపొక్క నేటికిన్

ఉ. హేయముగా దెచూచియు సహింపగవచ్చునెవిత్తకామినీ
కాయమునంతలో విసార । కాయకులన్ వెలచానలూనుచం
దోయికి భేదమేమిగల । దో? కపటానలకీలలైన కం
దోయిహొరంగురంగులఁగ । నుంగొని వెంగలివైకలంగుదే?

సీ. బుద్ధినాకర్షించు । పూఁతమెఱుంగుల
పైఁడిసలాకలౌ । వడిఁదనర్చి
అత్తరుపూఁతతో । నతిరమ్యముగనుండు
కాగితపుగులాబి । కరణిఁగ్రాలి
మెఱసితళుక్కున । మిఁఱుమిట్లుగొలుపు ప్రా
వృట్కాలచంచల । వితముమెలఁగి
అందమింపొంద నా । నందింపగాఁజేయు
సాయంసమయసంధ్య । సరణిఁదనరి

గీ. పెదవినంటినపూఁదేన । పెంపునింపి
అతిపవిత్రపాతివ్రత్య । మవనియందు
నెట్లొ మూర్తిభవించిన । యట్లు వఱలు
వేశ్యవలచిన మగవాఁడు । వెంగలీఁడు.

సీ. భోగినుల్ కపటాను । రాగసంపాదిత
జీవనల్ ఘోరదు । శ్శీలఖనులు
వైధవ్య మెన్నఁడు । బాధింపకుండ వ
ర్తించువిలాసినుల్ । హ్రీరహితలు



దుష్టచేష్టితముల । దోషంబులేదండ్రు
దుర్నయనిర్ణయ । దుర్నివార
లతులమాయోపాయ । లభిమానశూన్యలు
కరుణావిహీనదు । ష్కామమతులు

గీ. రాజభయమించుకయులేని । రాజవదన
లట్టివారలఁ గామించి । యాటపాట
లనుచు నామోదముంబొంది । స్వార్జితంబు
చిల్లిగవ్వగనెంచి వె । చ్చింపఁదగునె?

సీ. హేమసుందరుఁ డౌర! । యెంతటివాఁడయ్యె
ననుచు నోనాడుదు । రఖిలజనులు
ఘనవైద్యుఁడగుఁగాక । కామినీపరతంత్రుఁ
డనియేవగింతురు । గృహస్థులెల్ల
జారుండు కపటవే । షధరుఁడు వంచనా
పరుఁడంచుదూషింతురు । ప్రాణసఖులు
సంగబాహ్యుండు స । త్సాంగత్యహీనుండు
నీతిదూరుండండ్రు । జాతివారు

గీ. అత్తమామలు ఛీయని । యాదరింప
రాలుదుఃఖించి వెలిచవు । లభిలషించు
బలుకుబడిపోవు వెలలేని । పరువుతొలఁగు
నిల్లుదిల్లిగవ్వయు లేక । గుల్లయగును.

గీ. విషయముల సేవగించెను। విబుధవర్యు
లింద్రియసుఖాభిలాషయే। హీనమందు
రందు వారాంగనాసంగ।మాభిలాష
నీచమనుచు నిందింపరే। నీతిపరులు.

గీ. అఖలశాస్త్రంబు లెఱిఁగిన। యార్యవర్యు
లతివలను నమ్మరాదని। యందురందు
వెలవెలందుల నేమన।వలయు సఖుఁడ
వారల జయింపశక్యమే। బ్రహ్మకైన.

సీ. వలువ లిచ్చినయంతఁ। బ్రాణనాయక యంచు
వగలవన్నెలఁ జూపి। పలుకరించు
రూక లిచ్చినయంతఁ। బోకలాకులనిచ్చు
ముచ్చటించుచు ముద్దు। లిచ్చు మెచ్చుఁ
గాసు లిచ్చినయంతఁ। గామించు బ్రేమించు
దాసురాలనటంచుఁ। దారసించు
సొమ్ము లిచ్చినయంత। నెమ్మెలం బ్రకటించు
భోగింపు మనివేగ। కౌఁగిలించు

గీ. వలువ లీకున్న దూషించుఁ। బలువయంచు
రూక లీకున్నఁ బొమ్మని। యాక్రమించుఁ
గాసు లీకున్న విరసించు। నీఘపెంచు
సొమ్ము లీకున్న నుమ్ములఁ। గ్రుమ్మరించు.



గీ. వారకామినీ స్నేహంబు। వలనువలదు
కూర్మిచెలికాఁడ వాట వా।కుబ్రిచ్చివాఁడ
నఖిలసుఖసంకటములబ్బు; । ననుభవించి
పలుకుచుంటిని వెలలేని। భాషణముల.

వ. ఈయంశమిట్లుండె; మఱియు నొండురహస్యముఁగల దాక
ర్ణింపుము.

గీ. నీచసౌఖ్యానుకూలం బ।గోచరంబు
చంచలంబు; కామాంధకా।రాంచితంబు
జ్ఞానశూన్యంబు దారిద్ర్య।కారణంబు
ద్రోహచింతాన్వితంబు, వ్యా।మోహమనఘ.

మ. జరవ్యాఘ్రింబలె వేచి వేచి తుదకుం। సాధించు, బాధించు భీ
కరరోగంబులు శత్రువర్గము వలెన్। గాయంబు భుజించు, నే
సారిదిన్ బ్రోచినఁగాని యాయువు స్రవించు। ఛిన్నభాండంబువై
పరమార్థంబునుగాక తుచ్ఛసుఖము।ల్వాంఛింతురే సజ్జనుల్.

వ. అనినవిని యవ్వైశికుఁడు తిరస్కారసహితమందహాసాం
చితవదనుండై.

శా. ఈ వేదాంతము నీవెఱుంగుదువుగా। కీనాఁటికె వ్వానికేన్
భావింపందరమౌనె? వేశ్యలకు వి।శ్వాసంబు లేదంచు భా
షావైదగ్ధ్యము మీఱ బల్కెదవు వే।శ్యాలోలురై యొందఱో
కైవల్యంబును బొందిరీ వెఱుఁగుదే। యుష్మద్దేవతాఖండలా.

—♦ వేశ్యాసమర్థనము ♦—

సీ. మునుదాశకన్యను । మోహించి క్రీడించు
నాపరాశరుఁ డెట్టి । యార్యవరుఁడొ?
వేల్పుసానిం జూచి । వెంబడించి రమించెఁ
గౌశికుం డెంతటి । వైశికుండు
సురవేశ్యలం బట్టి । సురతకేళిం దేలె
మాందకర్ణియు నెట్టి । మానిచంద్రుఁ?
డానాఁడు వంచించి । యలయహల్యను గూడె;
జంభవైరియు నెట్టి । సజ్జనుండు?

గీ. చంద్రుఁడు మహానుభావుఁ డా । చరితమేల?
దారుకావనభాగవ । తాంబులుండ
శివునిఁ గూర్చి కృష్ణునిఁ గూర్చి । చెప్పనేల?
యీరహస్యంబు లెఱుఁగని । వారలెవరు?

ఉ. వేలఁగసొత్తులేక, రమి । యించి సుఖింపఁగసత్తులేక ప్రా
ల్మాలినవారలెల్లఁ గృతు । లన్ విరచించిరి నీతులక్కటా
చాలు; నెఱుంగమే? నిగమ । శర్మకు లోపముగల్గెనే? యజామి
ళుఁడు మోక్షమొందుటది । మిథ్యయె చెప్పుము బ్రాహ్మణోత్తమా.

వ. అనిన విని యవ్విప్రుం డిట్లనియె.

గీ. కృష్ణునింబోలి పదివేల । స్త్రీలతోడఁ
దానురతికేళిఁ దేలుట । ధర్మమైన



ద్రౌపదింబోలి యేవురు । తగులమొంది
తనదు కులకాంత మెలఁగిన । దప్పుగలదె?

వ. అంతటి స్వర్ణాభరణంబులం గొని యేతెంచు స్వర్ణకారుం
జూచి, లోనికేగుమని కనుసన్నం దెలియంజేసి, సుంద
రుం డవ్విప్రవరునితో నిట్లనియె.

గీ. ఎంతలో నంతవాఁడైతి । విట్టినీతి
యిట్టిపరమార్థచింతయు । నెట్లు గలిగె?
నీమచిత్తంబు గ్రహియింప । నిశ్చయించి
వాదులాడితి నిబ్బంగిఁ । బ్రాణసఖుఁడ.

గీ. భోగశాలివి నీవు వి । రాగివైతి
వౌను నీవనినట్లు స । ర్వాపదలకు
స్థానమగుఁగాదె? వేశ్యల । సంగమంబు;
సంతసించితి నీదువి । జ్ఞానమునకు.

గీ. మగుడఁ గన్పట్టెదవుగాక । నగినరీతి
నిన్నుఁ గొనియాడ నెమ్మది । నిశ్చయించి
నాఁడనని లేచి, లోనికి । నవ్వుకొనుచుఁ
జనియె; నతఁడట్లయౌగాక । యనుచు వెడలె.

వ. అట్లతండు లోనికేగి, స్వర్ణకారుఁడొసంగిన యాభరణంబుల
నొందుకరండంబున రహస్యంబుగఁ బొందికంజేసి యనంత
రంబున.

గీ. ఎపుడు సూర్యుండు గ్రుంకు నే । నపుడుదాని
యింటి కేగెద నప్పుడు । తుంటవిల్తు
గేరి రతిసంగరమున సు । ఖించువాఁడ
ననుచుఁ జింతించుచుండ న । య్యవసరమున.

చ. కటకట శీతరుక్కిరణ । కాంతికినోర్వని యావియోగులు
త్కటమగునాదుచండకర । కాంతికిఁదాళుదురొక్షయించున
స్ఫటికముఁ బూనినట్టు దిన । కాంతుఁడు తీవ్రతదక్కి వారుణీ
విటుఁడను వైఖరిన్ జరమ । వీధినిఁ ద్రిమ్మరె సానురాగియై.

— సంధ్యాసమయము —

చ. అరుణరుచుల్ దిగంతముల । నంతట నంతయుఁ బ్రజ్వలింప ని
ర్జరిఁగలనీరు రక్తమను । భ్రాంతికిఁ జిక్కు మృగప్రకాండముల్
బిరబిర నేగుదెంచి ప్రతి । బింబితసూర్యునిఁ జూచి సాధ్వస
త్వరితగతిన్ దొలంగినవి । పావకకుండముగా భ్రమించుచున్

చ. "మనపతి వారుణిన్ వలచి । మాంద్యమునన్ స్మృతిఁదప్పి పద్మినీ
వినుననుఁ బాసె" నంచునళి । నీరవవాక్కులఁ ఛాయ మున్న ప
ద్మిని కెఱిఁగించి ప్రాక్సతికిఁ । దెల్పఁగ నేగెననంగ నీడ, తూ[న్.
ర్పున కెగఁ బ్రాకె నంతయు న । భోమణి పశ్చిమదిక్పరుండుగా

గీ. జగతిఁ జక్రావనఖ్యాతి । నంతరించి
కువలయంబును పీడించు । క్రూరుఁ డీతఁ
డనుచుస్మితముఖి కుముదిని । యినుని, జూచి
పాడనాన్ మదబంభర । ధ్వనులతొసంగె.



సీ. రాగాతిశయమున । రంజించి మునుమున్ను
పూర్వదిశాంగనన్ । ముద్దులాడి
యంతకంతకు మోద । మభివృద్ధిఁ బొందఁగఁ
బద్మినినలరించి । ప్రజ్వలించి
వరకరంబులఁ జూచి । వారకాంతనుపరి
రంభసంభ్రమపరి । శ్రాంతఁ జేసి
వైభవం బుడివోవ । వసుహీనుఁడై యంతఁ
జరమాంగనన్ జేరి । సంగమించి

గీ. తనదుసద్గతిచ్యుతి లోనఁ । దలఁచి తుదకు
నకటసత్సంతతిహసించు । ననుచు వెఱచి
యేరికింగానరాకుండ । నేగె నినుఁడు;
అట్లయగుఁగాదె యమితకా । మాంధకుండు.

చ. వరుణునిమూవటీఁడు మద । వారణదాహనివారణార్థమై
వఱచినశోణమృచ్చయము । వైఖరిసంధ్యరహించినంత భీ
కరమగుదావపావకము । గా మదినెంచిభయంబు పెంపునన్
బరువిడెదిక్కులన్ విధుర । బాధకుఁదోడుగఁ జక్రవాకముల్.

చ. జలరుహపత్రసంచయము । చక్రనిశయ్యవిహారభూమియై
వలపులనీనుపువ్వవవ । వాటి శ్రమంబు నివారణంబుగాఁ
గలువలతావితో మలసెఁ । గమ్మనితెమ్మెరయైన నేమి తా
వలచినకాంతుఁ బాసి వల । వంతకుఁ జిక్కెను చక్రవాకి యే
స్థలమున హాయిగా మెలఁగఁ । జాలు; సుఖింపను పాయముండునే.

చ. రవియనునట్టువుం డపర।రంగముఁ బాసినయంతసంధ్యయన్
యవనిక నెత్తివేగమె ని।శాహ్వయ లాసికవచ్చి, రిక్కలన్
బువులనుజల్లి బాభరస।మూహము పాడఁగఁ జోరసంచయం
బవునని సన్నుతింపఁగ భ।యానకమున్ నటియించె నెంతయున్

చ. స్మరుఁడను నైంద్రజాలికుఁడు।సాంధ్యరుగంబరమంబరంబున
న్బఱచి, మహాంధకారమను।భస్మమునన్ గనుకట్టుకట్టి, బం
భరకుల నాదబీజయుత । మంత్రములన్ బఠియింప వక్త్రగ
హ్వరము నుబాసి పైకెగసి।నట్టిసుమంబులఁ బోలెఁ దారకల్.

—♦ అంధకారము. ♦—

మ. నను రూపంబున మీఱెదం చు శివుకం।ఠంబున్ బరీక్షించి, కృ
ష్ణుని చక్కందనమున్ హసించి, హలి మై।సొంపారు వస్త్రంబులం
గని ఛీఛీయని యీసడించి, గిరిజా।గర్వాపహారంబుగా
ఘనమై, సుందరుకీర్తిఁ బోలి చెలఁగెన్ । గాఢాంధకారంబిలన్.

సీ. విజ్ఞాన మనుసూర్య।బింబాస్తమయమున
మహి నాక్రమించిన।మాయయనఁగఁ
దనకాంతు నెమకంగఁ । దలఁచి సంచరియించు
ఛాయాసతీకేశ । జాలమనఁగఁ
బ్రజలు భీతిల్ల భీ।భత్సరౌద్రభయాన
కంబుల వర్షించు । ఘనమనంగ
వంచించి పాలించు । ప్రభువుల పాపంబు
పృథివిపై మూర్తిభ।వించెననఁగ



గీ. వ్యోమసుమవనీదోహద । ధూమమనఁగ
శాకినీఢాకినీభూత।జననియనఁగఁ
గామినీకాముకానంద । కందమనఁగఁ
జటుల గాఢాంధకారంబు । జగతిఁ గ్రమ్మె.

సీ. పల్లవైశ్వర్యమున్ । వారాంగనవిధాన
నంభోజవనలక్ష్మి । నపహరించి
వరగుణవంతునిఁ । బరదేశముం బలె
భృంగంబులను దైన్య । మొనయఁ జేసి
ధనకాముఁడై యేలు । కునృపతి వైఖరిఁ
బ్రజల నిర్బంధించి । బాధపెట్టి
విపులసంపద్రాశిఁ । గృపణుని చందాన
జ్ఞానంబు వ్యర్థంబు । గానొనర్చి

గీ. పృథివి నిమ్నోన్నతంబుల । నెఱుఁగకుండ
సత్పథంబును గ్రహియింపఁ । జాలకుండఁ
గడల వ్యాపించి జృంభించి, । కన్నులున్న
చీకులం జేసె లోకులఁ । జీకు వాలు.

—♦ అభిసారికలు. ♦—

ఉ. "అండజయాన యిట్టివిబి।డాంధతమస్విని నేడ కేగె దీ
వుండుము భీతి లేదె" యను।నొక్కవిటుం గనినవ్వి "నాప్రియుం
డుండుస్థలాంతరంబునకు।నొంటిగఁ బోయెదఁ గాక, పంచబా

ణుండు మదీయరక్షకజ।నుండయి యుండఁగ భీతి యుండునే
మందుఁడ" యంచుఁ బల్కె నభి।సారిక యోర్తుక శారికం బలెన్

చం. దినముఖవేళఁ గాకిఁ గని । తేకువఁ దప్పి భయంబు పెంపునన్
బనుల నమాని, యాత్మవిభు పైఁ । బడి యట్టి నిశీథవేళఁ జం
గున వడి గోడ దాటి యవ।గుంఠన యై యుపనాథు నింటికిన్
జని సుఖయించె నొక్క యభి।సారిక కోరిక దీర ధీరయై.

చం. రయగతి నాఁటి రేయి నొక।రామ విటోత్తముఁ గూడఁ గాళికా
లయమున కేఁగి యింకొక వ।లఁదికి నై చనుదెంచు వాఁడె స్వ
ప్రియుఁడని కౌఁగిలించి, రతి।రీతుల కించుక సంశయించి, భ
ర్తయని గ్రహించె, నా సతి స।తండును భార్యగ లో నెఱింగె నీ
పయి నెడఁ బాసి యుండమని। బాస యొనర్చిరి దేవిసన్నిధిన్.

సీ. పెద్దాడ నూహించి । విత్తమార్జించితి
నా విత్తమంతయు । వ్యర్థమయ్యె
నీ బ్రహ్మచర్యమిం।కెంతకాలం బంచు
నెలమి నేతెంచు సా।నింటిదాఁక
నేతెంచి యచ్చోట । నెవనినో వీక్షించి
సమయంబు గాదని । జంకి మొలఁగుఁ
దొలఁగి యింటఁ బరుండఁ । దలఁచు నిద్దుర లేమి
"నను జూచి నవ్వె నా।వనిత" యనుచు

గీ. పనటికింబోవు, సాహస।మనుచుఁ దొలఁగు
వెండియును వేశ్యలుండెడి । వీధికేఁగు



సంకటములుండు ననియెంచు । నంచలించు
వలపు వగఁ గూరి యపు డొక్క । బ్రహ్మచారి.

వ. తన్నిశాసమయంబున నా హేమసుందరుండు కామాక్షీ సుందరముఖచంద్రబింబావలోకన లాలసుండై,

సీ. దర్పణంబును బూని । దర్పకు దర్పము
ణాచుఁ జక్కనివాఁడ । నంచుఁ దలఁచి
ఘనసారమిళిత సు।గంధతైలముఁ బూసి
కమనీయ కాకప।క్షములు దువ్వి
వలపు నల్దిక్కుల । వ్యాపించునట్టుల
ముమ్మారు పన్నీట । ముఖముఁ గడిగి
కుంకుమంబునఁ గొంత । గోరోచనముఁ గల్పి
తిలకంబు వేమారు । తీర్చి దిద్ది

గీ. మీసముల నత్తరువు పూసి । మెఱుఁగు వెట్టి
చందనము లంది ధౌతవ।స్త్రములఁ దాల్చి
ప్రసవములఁ బూని పాలు స్వా।ల్పముగఁ ద్రావి
యాభరణ పేటికం గొని । యరుగుచుండ.

గీ. వాని వేషంబుఁ జూచి యా।భరణపేటిఁ
బట్టుకొని వేగముగఁ బోవు । వరుసఁ జూచి
తండ్రి యించుక పసిపట్టి । తనయు, యనుచు
నిట్టులని యెను ప్రేమంబు । నెట్టుకొనఁగ.

— జనకానునయము —

శా. తండ్రీ! తండ్రిని నీకు, నీ ప్రధనకాం। తం గూడుటం బట్టు నా
వేండ్రిం జేమనవచ్చు; రో వెలఁదులన్ । బ్రేమించువా రిట్టు లి
ల్లాండ్రం బాసి యాశంబునోసి కులమ। ర్యాదన్ విసర్జింతురే?
గుండ్రాఁ బోలిన నీదు మానసము నా। కుం ద్రిప్పఁగా శక్యమే?

కం. కులకాంత యౌవనంబునఁ
బులుగడిగిన ముత్తియంబు । పోలికనుండన్
వెలకాంతఁ గౌఁగిలింపఁగఁ
దలఁచెదు వైద్యుండవయ్యుఁ । దగునే కుమార.

గీ. విభుఁడవని మెంచి ప్రేమించి । వేచివేచి
విసిగి వేసారి నీభార్య । వెంగవలనఁ
జిక్కి క్షీణించె శల్యావ। శిష్టయయ్యె;
జాలి సుంతయు లేదె? పా। షాణహృదయ.

ఉ. మూఁడు దినంబులయ్యె, నతి। మూల్గుచునుండె, జ్వరంబు హె
చ్చెఁ, జే నాడియు మందగించె, నొక। నాఁడును దేనియలొల్లువట్లు
మాటాడవు; తిండిలేక తడి। యాఱెను నాలుక; జావఁ ద్రావ దే
గోడును లేక నీవు ధన। కోమలిఁ గూడి సుఖింపఁబోయెదే?

కం. కులకాంత యిట్టులుండఁగ
వెలకాంతను విశ్వసించి । వేదురుగొను నీ
తలఁపేమొ నే నెఱుంగను
తలమా; నినుఁ ద్రిప్పు నింద । తలపైకెక్కన్.



ఉ. మంచముఁ బట్టియున్న కుల। మానినిఁ జూడవు లంజెఁ జూచి వే
లంచములిచ్చి పైఁబడి స। లాములఁ జేసెద విట్టి ఘోరముల్
బంచముఁడైనఁ జేయుటకుఁ। బాల్పడఁ డోర! వివేకమిట్టిదే?
కుంచముఁ బాసి సోలఁగయి। కొన్న విధం బిది చూనె పుత్రకా.

ఉ. ఈమరవస్థ యిబ్లు ఘటి। యిల్లెఁగదా; విధి నేమనందు? మ
ర్యాద నతిక్రమించి పరిశ। మాభరణంబును వీటిబుచ్చి, నీ
త్యాదిగుణంబులన్ విడిచి। యూటవెలందికి జిక్కితే? నయా
పాదితబుద్ధి సూనశర। వహ్నికి నాశనమయ్యె నక్కటా.

మ. తనయా! నీయవివేకమాపదకు స। స్థానంబుగా నుండుఁ నే
పనికిం దొందరయెన్నఁడుం దగదు; సం। భావించి రాఁబోవు మే
లును కీడుం గల లాభనష్టముల నా। లోచించువానిం దనం
తన తాసంపద కౌఁగిలించుకొను త। థ్యం బేనుఃబోధించితిన్.

కం. వినురా! నాయుపదేశముఁ
గనురా! నీకులపవిత్రి। గౌరవపాత్రిఁ
జనురా! సన్మార్గంబునఁ
మనురా! జనలోకమాన్య । మాన్యంబులతో.

కం. అనరాదుర, కనరాదుర,
వినరాదుర, సానిదాని । పెంపుల్ సొంపుల్
ఘనరాజ్యవైభవాఢ్యులు
ధనరామలఁ గూడి చెడిరి । తథ్యము పుత్రా.

వ. అనిన విని యాలంపటుండు, రోషకషాయితలోచనుఁడై భీ
షణభాషణంబుల దూషించి, పిడతలఁగలబుద్ధి నిట్లాడిన
వృద్ధుండవుగాక యనుచు, నింటందిని పరుండఁజాలక నీకీ
యధికప్రసంగ మేటికనుచు ధిక్కరించి,

శా. ఏ నీమాటలసుంతియున్ విననుఁ; నీ వేకాదు బ్రహ్మాదులున్
రానీ, తిట్టినఁదిట్టనీ, కలిమియున్ బ్రాణంబులుం బోయినన్
బోనీ, చెప్పెదనన్న మాటఁదగ దీ మోహమోటమేమైననున్
గానీ, నాచిలుకన్ హొరంగు మొలకన్ గామాక్షిఁగోల్పోవు నే

వ. మఱియు ననేకవిధంబుల నోనాడి, గృహంబుఁబాసి వీధిం
బడి యేగుచు,

కం. అనుమానమేలరతులకుఁ
జనుమా, కామాక్షి పలుకుఁ జక్కని మొగమున్
వినుమా, కనుమా, మనమా
మనుమా సౌఖ్యంబులొందు మానంతతమున్.

మ. అనియిట్లాతఁడు కామసంజనితమోహభ్రాంతికిం జిక్కి తం
డ్రినిదూషించుచు స్వార్జితంబు ధనమున్ వెచ్చించి భోగించిన్
ననునోనాడునె? చూడ లేక కులకాంతారత్న మిప్పట్టునన్
దనువుం బాసినఁ బాయుఁగాక ధనమున్నం బెండ్లిగాకుండునే?
మనమా చింతిల నేటికంచుఁ జనియెన్ మార్గంబు గుఱ్తించుచున్.

వ. అంత నక్కామాక్షి యాతనిరాక కెదురుచూచుచుఁ దన
చేటికం జూచి,



మున్ను ఘటమానకుచకోకముల స్పృశించి
యరుణబింబాధరామృతం బానియాని
వారసతిఁగూడి సుఖయించె భాస్కరుండు.

చ. అరుణముఖప్రతాపరుచులంతటఁ జిమ్ముచుఁదోఁచినట్టియా
హరి యుదయాద్రిసీమపయి గాఢాంధతమఃకరికుంభమున్ గరో
త్కరనఖరంబులన్ దునుమఁగా భువి రక్తము తోఁచ ముత్యముల్
తొరఁగెననంగనాతపము తోడరహించెఁ దుషారబిందువుల్

వ. అనంతర మాహేమసుందరుండు ప్రాచినలంకరించిన మా
ర్తాండబింబావలోకనంబునఁ దల్లడిల్లి కామాక్షిం గౌఁగిలిం
చుకొని, మగుడవచ్చెదం గాకయని వచించి,

ఉ. వేళ యతిక్రమించెఁ బురవీథులసందడి హెచ్చె, నార! యే
లీలగృహంబుఁ జేరవలెఁ? గ్లేశమునన్ మఱిఁదప్పెఁదండ్రి; యి
ల్లాలెటులున్నదో; యకట ప్రాణము మీఁదికివచ్చెనేమొ? నే
జాలమొనర్పరాదనుచు జంకుచు నింటికి నేగె నవ్వడిన్.

గీ. ఎటులొ కామాక్షిఁ బాసి, త ద్గృహమునుండి
యతఁడు పురవీథులంబడి యరుగుచుండ
నల్లఱుంజూచి ఛీ యని యేవగించి
"ఇంతవాఁడయ్యెనే" యని యెంచి రపుడు.

ఉ. పువ్విలుకానితూపులకు, మోహితుఁడై సదసద్వివేకమున్
దవ్వుగఁబాసి, వైద్యమను దంభమునన్ ధనయౌవనంబులన్

గ్రోవ్వి, కులాంగనన్ విడిచి । కొంకక సొమ్ములఁ బెట్టి యాటకే
అవ్వకుఁ బాత్రుఁడయ్యె ధన । రామనుఁ గూడి సుఖింపఁ జాలెనే?

గీ. అతఁ డారీతి నాత్మగృ । హంబుఁ జొచ్చి
శోకవిహ్వల చిత్తులై । సోలి యేడ్చు
వారలం జూచి తండ్రి య । వస్థఁ జూచి
చచ్చి పడియున్న యిల్లాలి । సరణిఁ జూచి.

గీ. భోరు మని యేడ్చి యయ్యార ! యం । భోరుహాక్షి
నన్ను విడనాడె నకట రా । చున్న చావు
రాకయుండునె? యెట్టి దు । ర్గతి ఘటిల్లె
దైవమా యనుచు దుఃఖమం । తయు నటించె.

మ. కడుపుం గానుపు లేక యెన్నఁదగు సౌ । ఖ్యం బేమియు న్లేక యె
న్నడు నారోగ్యము లేక చూడ నగలు । న్నాణెంబులు న్లేక, రాఁ
బడి రోతొత్తుల కిచ్చి మెచ్చు మగనిన్ । బ్రార్థించి దుఃఖించి యి
ప్పుడు ప్రాణంబులఁ బాసె నన్నగు వయా । మూర్ఖుండు చింతించునే.

సీ. ప్రేమింపకుండినఁ । బెండ్లాడినందు కే
నాఁడైనఁ గూడి ముద్దాడె నొక్కొ?
అనురాగ మెట్లున్న । నాకు పోకల కంచు
నొకనాఁడు రూకైన । నొసఁగె నొక్కొ?
వెలకాంతఁ గూడెఁబో । కులకాంత యనియైన
నరసి నోరార మాటాడె నొక్కొ?



ఫలమెంత లేకున్న । జ్వరపీడితగు భార్య
నెపుడైనఁ జూచి మం । దిచ్చె నొక్కొ?

గీ. సరసుఁ డగుఁ గాక యవసాన । సమయమునకుఁ
దప్పుఁ డేతెంచినన్ జూడఁ । దలఁచె నొక్కొ
లోకు లేమందు రోయను । శోకమొందు
దక్క తదితరదుఃఖ మా । తనికిఁ గలదె?

వ. అట్లతండు లేని దుఃఖమంతయు నటించి భార్యకు దహనసం
స్కారాదిక్రియల నిర్వర్తించి,

సీ. బ్రదికియుండినవేళ । భార్య కీయక యున్న
వలువల ముత్తైదు । వులకు నిచ్చెఁ
గాసైన నొకనాఁడు । కాంత కీయక యున్న
నేఁడు దక్షిణల సం । తృప్తిఁ బఱచె
భుజియించెనో లేదొ । పొలఁతిఁ జూడక యున్న
తామసు రెండ్రిలకు భో । జనముఁ బెట్టె
నా లంచఁ బ్రేమించి । యాదరింపక యున్న
నాత్మబంధువుల నే । డాదరించె

గీ. నగ్నిసాక్షిగఁ దాను పెం । డ్లాడినట్టి
భార్య దురవస్థకుఁ గనాఁడు । వగవకున్న
బంధువులు పరామర్శకు । వచ్చినంత
భోరుమని వెక్కి వెక్కి నే । డ్వోరు పెట్టె.

వ. అనంతరమా హేమసుందరుండు భార్య మరణించినందుకు సుంతయుఁ జింతింపక మీఁదుమిక్కిలి మచ్చమూసినని యమితానందకందళితస్వాంతుండై, యథేచ్ఛసుఖంబులఁ గామాక్షిఁగూడి విహరించుచు, నామెయింటికివచ్చుచుఁ బోవుచు నపూర్వనామంబులఁ బెట్టి యాపథంబులఁ గల్పించి విక్రయించుచు, నమితవిత్తంబుఁ బ్రజలవంచించియార్జించుచుఁ గులమర్యాదల విసర్జించుచు నెల్లర నీసడించుచు స్వాతిశయంబున సంచరించుచుండెనంత.

—॥ గ్రీష్మము ॥—

సీ. చారవాతవిభీత । సర్వజీవవ్రాత
సంచారరహిత నిర్జనపథంబు
చండరుఙ్మార్తాండ । మండలాతపతప్త
సత్వాశ్వనావృతా । శాతటంబు
క్లుప్తవల్మీకాంత । సుప్తాహినిశ్వాస
దీప్తాగ్నితప్త పృథ్వీరుహంబు
పంకావశిష్ట పల్వలమధ్యవాసకృ
ద్భీకరసూకరీ । సూకరంబు

గీ. కాసరీకాసరోత్క్షిప్త । కర్దమంబు
ఖగసమాశ్రితసకల వృక్షవ్రజంబు
ఉష్ణకరతప్తకూపజ । లోష్మమైన
గ్రీష్మమేతెంచె జనలోక । భీష్మమగుచు.



సీ. తనదుకాయచ్ఛాయఁ । గనుఁగొనిమహిషంబు
పంకంబుగా నెంచి । పండుకొనియె
భూరిగుంజాపుం । జముం జూచి కాకంబు
రక్తపూరంబని । భ్రాంతిఁజెందె
ఛాయలవీక్షించి । జలముగా భావించి
శునకంబుత్రపరువిడి । సోలుచుండె
సంతాపముంబొంది । సర్పంబుగజతుండ
ముంజొచ్చి వల్మీక । ముగఁదలంచె

గీ. ఛాయ, సతిఁబోలిపాదంబుఁ । బాయకుండ
ఖలునిదుర్వచనంబుల । పొలుపువింపి
యనకరంబులు ప్రాణుల । యేపణంచి
చెప్పనొప్పునే? నిప్పుల । ఉప్పుమండె.

గీ. సకలవిరహులదీర్ఘ నిశ్వాసములనఁగ
వీథులను వేడిగాడుపు । వీచుచుండెఁ
బండుటాకులరాలిచి । పాదపంబు
వనమునఁ దపించె విరహిగం । బరునిఁబోలి.

గీ. ఛాయవిరహిణిఁబోలి కృశత్వమొందెఁ
బిసునమానసమట్లు తపించె జలము
కృపణునైశ్వర్యముంబోలి । వృద్ధిఁబొందె
నర్థగులఘోర దుర్గాహ । మవనియందు.

గీ. ఉగ్రసూర్యాంశువుల వేడి కోడి లేడి
యక్కటా హీనవృత్తంబు నాశ్రయించెఁ
దనదు భాగ్యపరిక్షీణ దశ దలంచి
సాధువొక నీచునిం జేరు చందమునను.

చ. హరహరులున్నిదాఘసమయంబున కోడి, తుషారభూమిభృ
త్సరిదధినాథులందుఁ దమ చానలఁ గూడి సుఖించుచుండఁ దు
స్తరపరితాపము న్విరహతాపము నోర్తు మెయంచుఁ బచ్చక
ప్పురముఁ గలట్టి చందనముఁ బూసి సుమంబులఁ దాల్చి మర్వి
టుల్ బిరబిర సంచరింపఁ దలపెట్టిరి పున్నమ రేయి నెల్లెడన్.

గీ. విటులు కొందఱు వేశ్యల వీథులందు
సంచరించుచుఁ గామాక్షి సదనమునకు
సుందరుఁడు లేని సమయంబుఁ జూచి జొచ్చి
సరసగతిఁ జేరి రామెను సురతమునకు.

వ. అంత నక్కామాక్షియు,

చ. ధనముఁ బరిగ్రహించి సురతంబున వారలకోర్కెఁ దీర్ప నె
మ్మనమున నిశ్చయించి, యనుమానవశంబున భీతి పెంపునన్
దనదు మనోహరుండు దఱిఁ దప్పక వచ్చునొ యంచు నెంచి
పొం డనుచు నిరాకరించిన మదాశయంబున వారలెల్లఱుక్
చ. కినుక వహించి "మమ్ముఁ బరికింపవొ? విత్తము నంగినంత, యా
వనమును విక్రయించి విటవర్యులఁ గూడెదు తొత్తువయ్యు బొం



డనుచు నిరాకరించెదివి యామరియాద? భవచ్ఛరీరముక్
దునిమెద పా నెలంజ" యని ముమ్ములుచిల్లులవోవ మోదుచుక్
చ. "ధనముఁ బరిగ్రహించి సురతమ్ము నమమ్ము సుఖింపనిమ్ము లేక్
దును మక సేలు కొందు"మని దూఱుచుఁ గట్టు సడల్చి రొక్కఁడా
వనితను కౌఁగిలించి బలవంతముగన్ రతి కుద్యమించినం
తనె చనుదెంచి సుందరుఁడు తద్దురవస్థను జూచి మ్రాన్పడెన్.

గీ. మ్రాన్పడినవాని వీక్షించి మండిపడుచు
విటులు గుమికూడి దుమ్ముల విఱుగఁ గొట్టి
రంత నాతండు దైవమా యనుచు నఱచి
చతికిలంబడి యెంతయు సంచలించె.

గీ. అతని యాక్రందనధ్వని యాలకించి
యిరుగుపొరుగులఁ గలవార లరుగుదెంచి
హత్తుహత్తని బెదరించి రంత విటులు
వెఱచి పఱచిరి దిక్కుల వెదకికొనుచు.

వ. అంత నా హేమసుందరుఁడు బ్రదుకు జీవుఁడ యనుచు మె
ల్లగ లేచి, యెల్లఱం జూచి లజ్జించి, వెండియు ధైర్యము
వహించి.

గీ. "నారహాస్య మెఱుంగని వారు గలరె?
ఇంక యూఱక లజ్జింప నేటి" కనుచు
నాఁటినుండియు భయము సుంతయును లేక
వెలవెలందిని దనయింటఁ బెట్టుకొనియె.

వ. ఇట్లు కామాక్షి నింటఁ బెట్టుకొని యథేచ్ఛాసుఖంబుల సం
చరించుచు.

సీ. "అర్థంబు లేదయ్యెఁ । దీర్థయాత్రల"కంచుఁ
దనివిఁ బొందని దాని । తల్లికొఱకుఁ
"గట్టబట్టయు లేదు । కఱవు తీఱదె"యంచు
వాదులాడెడు దాని । సోదరునకుఁ
"గూటికి కఱవయ్యె । గొప్పప్రాపక"మంచు
వెక్కిరించెడు దాని । యక్కకొఱకు
"నెంతవాఁ డనుకొంటి । నేమిలే" దని వాని
వాసి రోసిన దాని । దాసికొఱకు

గీ. నన్నగారంచుఁ ద్యాగంబు । సున్నయంచు
వావులం గల్పుకొను దాని । వదినకొఱకు
నున్న దనియు లేదనియు లో । నెన్నకుండ
కలిమి యంతయు వెచ్చించెఁ । దెలివిఁ దక్కి.

గీ. వలువ లనుచు నలంకార । ములకు ననుచు
సొత్తుఁ గామాక్షి సంగ్రహిం । చుటయుఁ గాక
దొంగతనముగ గృహమును । దోచుకొనియె
నప్పులకుఁ జిక్కి పాతని । యార్జితంబు.

గీ. తమ్ముఁ డొకవిత్తకాంతను । దగులుకొనియెఁ
దాగుఁబోతయ్యెఁ బినతండ్రి । తగవుమాలి



తండ్రి కూఁకూచి యేడకో । తలఁగి చనియె
వానిదురవస్థ వర్ణింప । వశమె మనకు.

గీ. వంచకుం డంచు నజ్ఞాన । వైద్యుఁ డనుచు
శాస్త్ర మెఱుఁగని వాఁడంచు । జారుఁ డంచు
జను లెఱింగిన యంతనే । సన్నగిల్లె
నంతకంతకు నప్పారి । నతనివృత్తి.

గీ. తనదు గృహలక్ష్మి పరలోక । మునకు నేగ
నకట పెద్దమ్మఁ బోలిన । యర్ధకాంత
యింటి కేతెంచ నైశ్వర్య । మెట్టు లుండుఁ?
గడకుఁ గడతేఱకుండునే । కపటవృత్తి.

ఉ. మాన్యములెల్ల నప్పులకు । మాటువడెన్ గలలోని కల్మి నా
ధాన్యము సన్నగిల్లె, జల । తారుగట్టి సుకూలవస్త్రముల్
శూన్యములయ్యె, నిల్లుగను । సొంపు చెడెన్ గులమే వగింపఁగన్
దైన్యమునన్ గృశించె మతి । దప్పి చరింపఁగఁ జొచ్చె నల్లెడన్.

మ. సుడిమాటం దలపెట్టరాదు తొలఁగెన్ । మాగాణి యేగానికిన్
దడవౌటన్ గడువడ్డియున్ బెరుగుటన్ । దాకట్టు వాకట్టుగా
బడి వమ్మయ్యెఁ గ్రమక్రమక్రమముగా । వస్త్వంబు క్షీణించె, రాఁ
బడి కాసైనను లేదు తుట్టతుదకున్ । బాధించెఁ గామాక్షియున్.

ఉ. దైవభయంబుఁ దక్కి భుజ । దర్పము విత్తము విశ్వసించి, స
త్కోవిదులన్ జనోత్తములఁ । గుత్సితులంచుఁ దృణీకరించి దు

ర్భావనలన్ మదించిధన । భామఁ బ్రాపకుఁడై "వినాశకా
లే విపరీతబుద్ధి" యను । లీలఁ జరించిన లక్ష్మి నిల్చునే?

వ. ఇట్లు కొంతకాలంబు గడచిన యనంతరమున,

ఉ. క్షామము దక్కుటయింటఁ గన । కంబొకయించుకయున్ లభింప దీ
లేమికిఁ దోడువృత్తియు ఫ । లింపక పాడఱె నన్యవిత్తకాం
క్షామయభక్షితాత్ముఁడని । యాతనవీడ్కొనె నామదేభ రా
డ్గామిని నీతిలేసి ధన । కామిని కామి ముఖోర్కకామికై.

గీ. తైలమంతయు క్షీణించు । దనుక వ్యాఖ్య
వాయఁదగునన్న పండిత । న్యాయమెంచి
యతని యైశ్వర్యమంతయు । ననుభవించి
యన్యునిం జేరి సుఖియించె । నాలతాంగి.

వ. భార్య మరణించుటకుఁ దోడు తావలచిన యక్కామాక్షి యన్యవిటసమాకర్షితచిత్తయగుటకు మిక్కిలి చింతించి, దారిద్ర్యభారవహనక్లేశంబునఁ దల్లడిల్లి పరితాపంబునఁ దపియించుచుండ,

— వర్షాకాలము —

శా. హర్షంబెల్లగు శీహంసధర్షమయి, చిత్తాకర్షమై యంబుదో
త్కర్షంబై గృహిణీవియోగగతచి । త్తాక్రాంతపాంథప్రజా
మర్షంబై కకుబంతకుంభగళితాం । భఃక్లిన్నభూశీర్షమై
వర్షాకాలము వచ్చెఁ బ్రజ్వలితశం । పామాలికాభీలమై.



గీ. వగవలాకదంతంబుల । వాసిఁగాంచి
ప్రసరద్వారిదాన ధా । రల వహించి
భూరితటిదంకుశవిఘాత । ములకు నలిగి
గగనవీథిని గర్జించె । ఘనగజంబు.

గీ. ఇండ్లకుం బోండు భార్యల । నేలుకొనుఁడు
పాంథులార యంచు జగానఁ । బంచశరుఁడు
ఢమఢమధ్వనిమ్రోగించు । ఢక్కయనఁగఁ
గడల నడరె ఘనాఘన । గర్జనంబు

గీ. మేఘుఁడను క్రూరదైత్యుఁ డ । మోఘబలుఁడు
నింగిఁగల చంద్రసూర్యుల । మ్రింగినంత
వార లొనరించు రోదన । ధ్వనియనంగ
దిక్కులను గర్జనంబు ప్ర । తిధ్వనించె.

గీ. యువతిచిత్తవృత్తి గ్రహింప । నోపకెందు
మూఢులై సంచరించు కా । ముకులెఱుంగ
నస్థిరమనేకరాగర । మ్యంబు గుణవి
హీనమను రెంద్రచాపము । ప్పెసఁగె దివిని

గీ. ఘనన్నృపతియుండు గగనప । త్తనమునందు
నింద్రచాపమన్ గోపుర । మెత్తువేళ
విరసవాక్కులవర్ణించు । భేకనామ
కాకవులకుఁ బంకాభిషే । కములభించె.

సీ. సూచికాభేద్యమై । చూడసొంపుగ మేఘ
మఖిలదిక్తటముల । నాక్రమించె
మబ్బులవీక్షించి । మదవికారంబునఁ
గేకులు క్రేయని । కేకరించె
నాళాంగనాతార । హారంబులనుబోలి
యమితధారాసార । మతిశయించె
నదులునూతులుచెఱ్వు । లెదిగి యేకముగాగ
నధ్వగసంచార । మణఁగిమణఁగె

గీ. వాతపోద్ధూతసంతాప । మంతరించె
విరహిణీమనస్తాపంబు । పెచ్చుపెరిగె
దుర్దినంబని జనులు కుం । దుటకుఁదోడు
దుర్దమంబుగ వ్యాపించెఁ । గర్దమంబు.

శా. ఆరావప్రతిరావముల్ నిగుడనీ । లాబ్దంబువర్షించె నే
డౌరా! చిత్రము; వారకాంతయనసూ । ర్యంపశ్యయైయుండఁగా
నీరేజాప్తునిఁజూడకంతిపుకులన్ । నిద్రించుచున్ జైతుణల్
వారస్త్రీఁ దిలకించి హేళనముగా । భాషించినం జెల్లునే?

కం. చిటపటచినుకులు రాలెను
పటపటమనిపండ్లుకొటికె । పారెను హంసల్
వటవటపేలిరి విరహులు
కటకటపడుచాతకములు । కడుపులు నిండఁగ.



వ. ఆహేమసుందరుండు వర్షర్తుశీతలవాతపోతసందీపితకామా
గ్నిసంతప్తుండై, యనేకభంగులఁ జింతించి, దుఃఖించి కుల
కాంతందలంచి, పశ్చాత్తాపముఁబొంది, యన్యవిటన
మాకర్షితచిత్తయై తన్నడఁబాసిన కామాక్షిందలంచి వల
వంతకుఁజిక్కి, పొక్కి, పంచబాణనిర్భిన్నహృదయుండై,
పూర్వపరిచయంబునకైన నన్నాదరింపకున్న, మోమో
టము లేకయున్న యనినిశ్చయించి సత్వరంబుగఁ గామా
క్షిగృహంబున కేగినంత,

గీ. అకట కుందేటివేటకు । నరుఁగువాని
బెబ్బులి యెదుర్పవచ్చిన । విధముదోప
వలచి కామాక్షివీక్షింప । వచ్చువాని
నెదురుకొని రండు రండన । వృద్ధవేశ్య.

గీ. రండు రండని యత్యాద । రమునఁబిల్చి
యాసన మొసంగి భాషించి । వేసముఁగని
భళిర కాసైన లేకుండ । వచ్చెననుచు
వికటముగ నవ్వి కోపించి । వెక్కిరించి.

గీ. "తగునునని యెంచి కామాక్షి । తగులమునకుఁ
బరుగుపరుగున వచ్చితే । బాగు! బాగు!
పొట్టకుఁగా బట్టకుఁగాలేక । పొక్కెదీవు
కానియున్ లేనివానికి । సానియేల."

మ. రజతంబున్ గనకంబు నంబరములన్ । గ్రామంబులన్ మేడలన్
గజయూథంబుల గొప్పవారువములన్ । గామాక్షి కీవచ్చితో?
రజకుం డిచ్చిన యన్యవస్త్రములు నై । రాజిల్లనుప్పొంగుచున్
భుజముల్ ద్రిప్పుచుఁ జూడవచ్చితివి పో । పో బోడిసోమా దిగా.

గీ. అనుచుఁ బైఁబడవచ్చిన । యాపెఁ జూచి
సరససల్లాపసంభోగ । సౌఖ్య మనెడు
బిచ్చమున కొక్కదండంబు । వేఁపిఁ గట్టు
కొనుము కామాక్షి యనుచు నా । కుటిలుఁ డేగె.

చ. అరిగి గృహంబుఁ జేరి కుల । టాంగన చేసిన మోస మెంచి సుం
దరుఁడు సుమాస్త్రబాధ కెదఁ । దాళఁగలేక కృశించి యింటికిన్
బొరుగున వాసమున్న యొక । ముద్దులగుమ్మను జూచి యామెతో
సరసముఁ జేయ నెంచి కను । సన్నలఁ దెల్పి గ్రహించె నమ్మతిన్.

ఆ. అర్ధరాత్రము వేళ । నాపె వాసముఁ జేరి
సురతకేళిఁ దేలి । సొలిసొలి
గళమునందుఁ గ్రాలు । కాంచనాభరణంబు
సంగ్రహించి యేగు । సమయమునను.

చ. కులటనుమించు నంచుఁ దన । కోమలి పైఁ గలసందియంబుచే
వలికిడిఁ బట్టి యెవ్వఁడో ని । జాంగనకై చనుదెంచెనంచు లోఁ
దలఁచి మగండు మేలుకొని । దానివిటుం గని చోరుఁ డంచు న
క్కలవడి దొంగదొంగ యని । కెవ్వన నేడ్చెఁ బురంబు మేల్కొనన్



చ. పలువురు వచ్చి సుందరుని । బట్టి గళాభరణంబుఁ గాంచి కో
నలరి తలారులం బిలిచి । రంతట వారలు వచ్చి చోరుఁడు
క్కలుఁడని వాని దుమ్ములను । గట్టిగఁ గొట్టి కరంబులన్ వడిన్
గొలుసులఁ జేర్చి కట్టి చెఱ । కున్ జని రేమనవచ్చు దుర్విధిన్.

వ. అమ్మరునాఁ డా రాజభటులు,

గీ. చంద్రమాదుండు కొలువుండు । సమయమునకు
హేమసుందరుఁ గొంపోయి । యెదుటఁ బెట్టి
యపహరించినవాఁ డంచు । నాభరణముఁ
జూపి యాజ్ఞకై తఱివేచి । చూచుచుండ్రి.

వ. అనంతర మాభూపాలవరుండు జారచోరశిఖామణి యగు నా హేమసుందరుం దిలకించి యతండు వైద్యవృత్తిని జీవించువాఁడుగా సభ్యులవలన నెఱింగి నిజాస్థానరాజవైద్యవరుల రావించి, వైద్యశాస్త్రజనితజ్ఞానం బమోఘంబని ప్రశంసించుచు హేమసుందరుఁ బరీక్షింపఁ దలంచి, సభలో గూర్చుండఁ బెట్టి,

మ. చలమే పారఁగ వైద్యశాస్త్రవిధులన్ । జర్చించి, రోగంబులం
గలభేదంబుల నౌషధంబులఁ బరీ । క్షం జేసి, మూర్ఖుండు లో
కులవిత్తంబు హరించు చోరుఁ డనుమ । న్గోపించి యత్యుగ్రుఁడై
"వలువా" యంచు విధించె భూవరుఁ డుయా । వజ్జీవనిర్బంధమున్.

వ. ఇట్లా హేమసుందరుండు,

శా. కారంబిక్కృశించి దైన్యమునము । క్కాలంబు దుఃఖించియా
రారా! దైవము ప్రోవుమంచు నెదలో । ధ్యానించి క్షీణించె, సం
సారంబంచుఁ గులాంగనం దలఁచి ప । శ్చాత్తాపముం బొందె దా
గారాబంబుగ నేలినట్టి కులటన్ । గామాక్షి గర్హించుచున్.

గీ. నీతి నెడఁబాసి ప్రాణహా । నియు నొనర్చె
జనుల వంచించి విత్తంబు । సంగ్రహించె
భార్యఁ బీడించె వేశ్యను । బ్రాపానంగ
ననుభవించక తప్పునే । యాయఘంబు.

మ. దురవస్థం దలపెట్టి యిప్పుడు మదిన్ । దుఃఖించినన్ జెల్లునే?
స్థిరధైర్యార్యులవాక్కులన్ వినెనె? బు । ద్ధిం గల్గి వర్తించెనే?
సిరియున్ యౌవనమున్ భుజద్వయబలో । త్సేకంబు గర్వంబు న
శ్వరమే యాత్మకృతంబు వ్యర్థమగునే । "భ్రష్టస్య కా వా గతిః"

క. మతిమంతుఁ డెవ్వఁ డీన
త్కృతిసారాంశము గ్రహించి । కీర్తించును వాఁ
డతిధృతియై క్షితిలో న
ద్గతికిన్ గుఱియై మెలంగు । గౌరవ మొందున్.

మ. ఘనభావార్థపదప్రయోగసరణిన్ । గ్రంథంబులన్ వ్రాసినన్
విని విద్వాంసులు సంతసింతురనుచు । "న్విద్వత్సు దారిద్ర్యతా"
యను న్యాయ్యంబటులుండఁగా "సుకవితా । యద్యస్తి రాజ్యేనకిం"
మ్మను వారోక్తిఁ దలంచి వ్రాసితి నుపా । ఖ్యానంబ నూనంబుగన్.



మ. ధనకాంతాకుచమండలంబునకుఁ జి । త్తం బిచ్చి విత్తంబు యౌ
వనముం బాసి విరక్తిఁ జెందితుదకు । "న్వైరాగ్యమేవాభయం"
బని వర్తించి జనాళికిన్ హితము సౌ । హార్దంబునం దెల్పు నా
తనికిన్ స్వచ్ఛమతో నొసంగితిని యే । తద్గ్రంథకర్తృత్వమున్.

— ఆశ్వాసాంతము —

క. నయవినయసుగుణధుర్యా
భయదాసురధైర్యకార్య । భంజనచర్యా
జయలక్ష్మీప్రియకాంతా
నయనీకృతపుష్పవంత । నతహనుమంతా.

— మంగళమహాశ్రీవృత్తము —

చిత్తజవిరోధివిధి । జిష్ణుసురసన్నుత వి । శేషగుణరత్నగణపేటీ
మత్తరిపుదైత్యగజ । మారణకళాకలిత । మంజులయశస్తురగధాటీ
కృత్తశివచాపరవ । కృష్టకృశకర్ణయుగ । కృచ్ఛ్రియుతభార్గవ
జయశ్రీ, చిత్తనువిలాసముని । సేవితపదాంబుజ! వి । శిష్టజనమం
గళమహాశ్రీ.

గద్య: ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష ప్రసాదిత సత్కవితా
లతాపరిస్ఫూనాయమానంబై నవీనప్రబంధంబయిన హేమ
సుందరోపాఖ్యానంబు నందుఁ జరమోదాత
తృతీయాశ్వాసము వందు సర్వంబు
సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు

# "రాష్ట్రేతరాంధ్రులు" Andhras Abroad

ఇదియొక ఆంధ్రమాసపత్రిక. క్రౌన్ 1/4 సైజున ముద్రింపబడుచున్నది సంవత్సరచందా ఒక రూపాయి ముందుగా చెల్లింపవలెను. ఖరగపురపు ఆంధ్రజనసంఘము వారి యాజమాన్యమున ప్రకటింపబడుచున్నది. దీనికి ముఖ్య సంపాదకులు ఆంధ్రసభారత్న భండారు దండపాణి పంతులుగారు. ఇందు సాంఘిక, ఆర్థిక, విద్యా, ఆరోగ్య, పారిశ్రామిక, నైతిక, వాఙ్మయ మత విషయములగూర్చిన వ్యాసము లుండును. రాష్ట్రేతరాంధ్రులం దాంధ్రత్వము, స్థిరత్వము వహించునటుల జేయుటకును, ఆంధ్రోద్యమప్రచారము గావించుటకును, ఆంధ్రులకును ఇతర జాతులవారికిని నడుమ పరస్పరసోదరభావము పెంపొందించుటకును, రాష్ట్రేతరాంధ్రుల సాంఘిక కార్యక్రమములనెల్ల కేంద్రీకరించుటకును నిరంతరకృషి సేయును. రాష్ట్రీయ, రాష్ట్రేతర ఆంధ్రులెల్లరును స్త్రీపురుషవిచక్షణలేక చదువవలసిన పత్రికారాజము. రాష్ట్రేతరాంధ్రుల నడుమ ప్రచారము గోరువారు "రాష్ట్రేతరాంధ్రు"లందు ప్రకటించినచో మనోరథసిద్ధిం గాంచగలరు. వివరములు గోరువారు.—

"ఆంధ్రజనసంఘ గౌరవకార్యదర్శిగారికి

ఖరగపురము" అని వ్రాయునగును.

# SRI RAMAKRISHNA.

A High Class Religions Monthly Magazine English

**Editor:-G. L. N. SARMA, ADRA. Manbhum dt. India.**

**GIVES—** Full information of all the Rama Krishna Missions established throughout the length and breadth of India and other Continents.

**DEALS WITH—** All forts of religions Philosophic Educational & Moral subjects wr by Eminent Scholars.

**TEACHES—** Teachings of the Great men such as Sr. Ramakrishna, Buddha, Sankaracha Vivekananda Etc

☞ Annual Subscreption Rupee one only paid in advance. Single copy Annas two only.

